# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

156 మాసపత్రిక అక్టోబర్ 1984



| నిర్వహణ | సృజన | సంవత్సర చందా రు. 20 |
|---|---|---|
| సాహితీ మిత్రులు | హనుమకొండ 506 001. | ఈ సంచిక రు. 2 |

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref, 182/A4/67, dated 22-9-1967.

Printed' Edited & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Venkatakrishna Mudranalayam, PinnavariStreet, Warangal for Venkataramana Mudranalayam, Warangal

## ెల-పొడుపు !?

అగస్టు 13 రాత్రి హనుమకొండ పోలీసు లాకప్‌లో చిత్రహింసలకు తట్టుకో
ేక రక్తంకక్కుకొని ఒక మనిషి మరణించాడు. ఎన్టీఆర్ హయాంలో పోలీసు
ాకప్‌లో అది పద్నాలుగవ హత్య. అతని వెంట వున్న బంధీలను బొంబాయికి తీసు
వెళ్ళి అక్కడ అరెస్టు అయినట్లుగా, వాళ్ళకు వరంగల్ జిల్లాలోని పాలకుర్తి
్రామంలో జరిగిన ఒక దొంగతనంతో సంబంధం వున్నట్లుగా కేసు బనాయించి కోర్టు
లో హాజరు పరిచారు. వాళ్ళది కరీంనగర్ జిల్లా హుస్నాబాద్ తాలూకాలో ఒక గ్రామం.
్రామీణుల సామాన్య జీవితానికి సంబంధించినంతవరకు అది పాలకుర్తికి చాలాచాలా
దూరం.

అగస్టు 16 న పట్టపగలు హైదరాబాద్ నగరంలో "ప్రజాస్వామ్యం" హత్య
చేయబడ్డది. బర్తరఫ్ అయిన ఎన్ టి ఆర్ కూడా పోలీసులాకప్‌లోకి కాకున్నా స్టేషన్‌లోకి
వెళ్ళి వచ్చాడు. ప్రజాస్వామ్య ప్రతినిధులయిన బందీలందరూ ఢిల్లీకి అటునుంచి
బెంగుళూరుకు అటునుంచి రామకృష్ణ సినీ స్టూడియోకు క్యాంపుల్లో తిరుగుతూ, పోలీసు
సెర్చిలు, మెటల్ డిటెక్టర్‌లు మొదలయిన అగ్ని పరీక్షలు గడచి మెజారిటీ రుజువు
చేసుకున్నారు సెప్టెంబర్ 16న "ప్రజాస్వామ్యం" పునరుద్ధరించబడింది. అయితే అసెంబ్లీ
సభ్యుల మెజారిటీ వల్లకాదు అమ్మ మెసేజ్ వల్లనే 'అన్న' అపూర్వంగా అధికారానికి తిరిగి
వచ్చాడు. రాంలాల్ 'సంతృప్తి' చెంది ఎన్ బి ఆర్‌ను ముఖ్యమంత్రిని చేస్తే ఎస్ డి
శర్మ 'సంతృప్తి' చెంది ఎన్ టి ఆర్‌ను ముఖ్యమంత్రిని చేసాడు. ఇందిరా ఏజెంట్ల
ిద్దరికి ఒకరి తర్వాత ఒకరికి ఇంత అధికారాన్ని ఇచ్చింది గవర్నర్ పదవి. ఐదవ
ప్రక్రం అరవ వేలుగా 'రాజనీతి శాస్త్రజ్ఞులు' పేర్కొనే "రాజ్యాంగాధినేతల"కు
వున్న పవర్లు అసెంబ్లీలకు లేవని మరోసారి పాఠం చెప్పిగానీ ఇందిర ఎన్ టి ఆర్‌కు
అధికారం ఇవ్వలేదు మెజారిటీ నిర్ణయించేది గవర్నర్ లాన్స్‌లో కాదు అసెంబ్లీలో
పార్లమెంటరీ సత్సంప్రదాయాల గురించి మాట్లాడిన పార్లమెంటరీ ప్రతి పక్షాలు,
లాన్స్‌లోనే అటు అధ్యక్షునికి ఇటు గవర్నర్‌కు ఎన్ టి ఆర్ మెజారిటీని చూపించాయి
ది అసెంబ్లీలో తేలకముందే తన సంతృప్తితోనే గవర్నర్ ఎన్ టి ఆర్‌ను తిరిగి
ముఖ్యమంత్రిని చేశాడు. అట్లాచేసే అధికారం గవర్నర్‌కు రాజ్యాంగం ఇచ్చిందని
రో మారు చెప్పదలచుకున్నది ఇందిరా గాంధీ. ఒకనెల రోజుల పాటు ప్రజాస్వామ్య
పునరుద్ధరణ కోసం పోరాటం చేసినా పార్లమెంటరీ ప్రతిపక్షాలకు ఇది మింగ లేని

కక్క లేని రాజ్యాంగ వరప్రసాదం. ఇంతకన్న ఫార్స్ మూడురోజులపాటు అసెంబ్లీలో జరిగింది. మైకులు విరిగాయి. బల్లలు పగిలాయి. ఎవరూ రెండో వాళ్ళకు చెప్పడానికి వీలులేని, ఏతెల్ల కాగితమూ రికార్డు చేయడానికి అంగీకరించని భాష సీనియర్ అసెంబ్లీ సభ్యుడు మాట్లాడాడు కాబట్టే ఆయన స్పీకర్ పదవికి అర్హుడయ్యాడు. కనీవినీ ఎరుగని గందర గోళం అసెంబ్లీలో జరిగిందని అందరూ అన్నారు. అన్ని పత్రికలూ రాసాయి అయితే అందువల్ల అసెంబ్లీ వాయిదా వేసారు తప్ప రద్దు చేయలేదు.

కాని రెండు విద్యార్థి వర్గాల మధ్యన తీవ్రమైన ఘర్షణలు వున్నాయి గనుక వరంగల్ జిల్లాలో విద్యార్థి సంఘం ఎన్నికలు పెట్టడానికి వీలులేదని ఎస్పీసిఫారసు చేస్తాడు కలెక్టర్ ఫార్వర్డ్ చేస్తాడు, ప్రాంతీయ ఉన్నత విద్యాధికారి కాలేజీలకు అదే కాగితాన్ని పంపుతాడు. ప్రిన్సిపల్స్ అది ఎన్నికలను నిషేధించడంగా అర్థం చేసుకొని శిరసావహిస్తారు.

ఎన్ టి ఆర్ అధికారం కుమ్ములాటలో ఒక నెల రోజుల పాటు ఆంధ్ర దేశ మంతా జరిగిన హింసాదౌర్జన్యాలు, ఘర్షణలు అందువల్ల ఏర్పడిన ఉద్రేకతలు, పౌర జీవిత ప్రతిష్టంభనతో శతాంశమైనా పోల్చదగిన నిషేధపు అవసరం వరంగల్ జిల్లా విద్యార్థి సంఘం ఎన్నికల్లో ఏర్పడిందా?

అంతేకాదు ఎన్టీ ఆర్ ప్రజాస్వామ్య చైతన్య రథం రాజ్యాంగపు భూమిపుండులో దిగబడిపోతే భుజం ఒడ్డిన భారతీయ ధర్మమే తెలంగాణ వ్యాప్తంగా వాక్సభా స్వాతంత్ర్యాలపై పోలీసుల ఆంక్షకు ఒత్తాసుపలుకుతున్నది. ఎన్టీ ఆర్ బర్తరఫ్ పై అయినాసరే అందరినీ పిలిచి సూట్లాడించే హక్కు ఆర్ ఎస్ యుకు లేదంటుంది అధర్మం. ఎన్టీఆర్ ప్రజాస్వామిక హక్కును కాపాడడానికి కాకతీయ యూనివర్సిటీకి వచ్చిన పి యు సి ఎల్ నాయకులు, వాళ్ళ ప్రసంగాలు ఏర్పాటు చేసిన డీన్ హక్కుల సంగతి అలా వుంచి 'తల' ఉత్తరించడానికి కూడ బాధ్యులయ్యారు.

ఆధునిక కురుక్షేత్ర యుద్ధంలో ధర్మ రక్షణార్థం హోరా హోరీ పోరాటం జరుగుతుంటే లేగలకాళ్ళ విరిగినచప్పుళ్ళ ఎవరికి వినవస్తాయని!

గ్రామాలపై విప్లవసానుభూతిపరుల ఇళ్ళపై పోలీసులదాడులకు ఇదే అదన యింది. జైళ్ళలో ఖైదీలనోళ్ళు నొక్కడానికి ఇదే అవకాశమైంది. సారా కంట్రాక్టర్ల అఫెన్సుకూ ఇదే సమయమైంది. 'మత కల్లోలాల' పేర రాజకీయ గూండాయిజం "కర్ఫ్యూ"ను ఆహ్వానించడానికే కలిసొచ్చింది. "మత కల్లోలాల్లో" ప్రజలు, అమా యకులైన ప్రజలు మరణిస్తారు. అదుపు చేసే పేరుతో పోలీసు కాల్పుల్లో ప్రజలు, అమాయకులైన ప్రజలు మరణిస్తారు. రెండుసార్లూ ఎంత నిర్వచక్షతో హింసా దౌర్జ న్యాలు జరుగుతాయో మృతుల పేర్లు, వయస్సు, వృత్తి జాబితాలుచూస్తే, ఎవరికైనా హృదయం కరిగిపోతుంది.( ఈ అమానుష వ్యవస్థ పరాయీకరణ దుర్మార్గానిక్రమంగా కరడు గట్టకుండా మిగిలివుంటే )కాని ఈ హింస గురించి ఏ మర్యాదస్తులూ మాట్లాడరు కనీసం "మత కల్లోలాల" హింసా దౌర్జన్యాల గురించి మాట్లాడే పెద్దమనుషులయినా ఇది సాకుగా–పోనీ కారణంగా రాజ్యాంగయంత్రం అమలుచేసే అణచివేత గురించి పెదవికదపరు. ఇంతకన్న విచిత్రమైన ద్వంద్వవైఖరి ఎన్టీఆర్ బర్తరఫ్తోనే మళ్ళీ ఒకమారు బట్టబయలైంది. హింసా దౌర్జన్యాలు జరుగుతాయని హెచ్చరించాడు సాక్షాత్తు మాజీ రాష్ట్రపతి. ప్రజలు బస్సులు తగలపెట్టినా, రాళ్ళువిసిరినా, రైలుపట్టాలు తొల గించినా, పోలీసులపై తిరగబడినా పత్రికలన్నీ పెల్లుబికిన ప్రజాఆగ్రహంగా 'తగిన శాస్తి'గా వర్ణించాయేతప్ప ఎక్కడ ఈచర్యను హింసా దౌర్జన్యాలని పేర్కొన లేదు. ఎన్టీ ఆర్ కూడ 'రక్తపాతం తప్పద'నిఅని తనన్న సందర్భం పేరన్నాడు. వాళ్ళందరికీ విప్లవకారుల, వాళ్ళ నాయకత్వంలోని ఉద్యమాల గురించి ఇదివరలో మాట్లాడినప్పుడైనా, ఇకముందు మాటాడేప్పుడయినా ఈ నెల రోజుల సంఘటనలు గుర్తుంటాయని ఆశిద్దాం! ఈ సంఘటనలపట్ల వీళ్లుచూపిన సానుభూతిమాత్రమేకాదు సంఘీభావం కూడ గుర్తుంటుందని నమ్ముదాం! ఎందుకంటే ఆంధ్ర దేశమంతటా వీధుల్లో ఈ రూపాలల్లో వ్యక్తమయిన ప్రజాఆగ్రహమే అసెంబ్లీలో ఎన్టీ ఆర్ బలాన్ని నిల బెట్టింది. ఢిల్లీలో ఇందిరను భయపెట్టింది. అయితే ఈ ప్రజాఆగ్రహాన్ని అణచ డానికి ఇందిర అయినా, ఎన్టీ ఆర్ అయినా, ఎన్వీ ఆర్ అయినా మళ్ళీ ఎన్టీఆర్ అయినా నిజమైన అధికారం ఎవరికిస్తున్నారో అందులో ఇమిడివున్నది మన 'ప్రజాస్వామ్యం' ప్రాణమంతా–

విద్యార్థి సంఘాలు - ఎన్నికలు అనే అంశంమీద వరంగల్ కాకతీయ మెడికల్ కాలేజీ ఫిజియాలజీహాల్‌లో ప్రిన్సిపల్ అనుమతితోనే సెమినార్ ఏర్పాటు చేశారు ఆర్ ఎస్ యు విద్యార్థులు. అన్ని విద్యార్థి సంఘాలను, వృత్తి సంఘాలను, ప్రజాసంఘాలను ఆహ్వానించారు. వాళ్ళు ఆహ్వానించనిది ఒక్క పోలీసులను మాత్రమే. వాళ్ళు మాత్రమే వచ్చారుగనుక రావలసిన వాళ్లెవరూ రాలేదు. ఇద్దరు సర్కిల్ ఇన్‌స్పెక్టర్లు, ముగ్గురు సబ్‌ఇన్‌స్పెక్టర్లు, రెండు లారీల నిండా సాయుధ పోలీసులు పరిసరానికి అడ్డంగానూ, చుట్టూనూ ఆక్రమించుకొని తమ ఉనికివల్ల, చూపువల్ల, హావభావాలవల్ల మాత్రమేకాకుండా మెట్లదాకా వచ్చినవాళ్ళను 'వ్యాన్ ఎక్కదలచుకున్నారా' అని మాటలవల్ల కూడా బెదరగొట్టి చెదరగొట్టారు "ప్రజాస్వామ్య పునరుద్ధరణ" తర్వాత పదవ రోజు జరిగిన సంఘటన ఇది. ఇందులో ఎ బి వి పి, ఎం సి పి మొదలు ఎన్నీఆర్ ఎన్టీ ఆర్ దాకా ఎవరికీ అప్రజాస్వామిక స్వభావం కనిపించక పోవచ్చు.

అన్నపురెడ్డి పల్లెలో నయినా అనంతపురం లోనయినా కర్నూలు, కడప కర్నూళ్లో నయినా 'ప్రజాస్వామ్యం' "ప్రజా జీవిత పరి రక్షణ" బాధ్యత ఖాకీ దుస్తులపై వుంటుంది. పోలీసు పాలన సజావుగా సాగడమే కాదు, ప్రజా ఉద్యమాలు బల పడే కొద్దీ పాలకవర్గాలన్నీ ఆకవచం ధరించే బతకదలుస్తాయి. అప్పుడప్పుడే ఎన్నికల ప్రహసనాలు, ప్రభుత్వ పతనాలు, "ప్రజాస్వామ్య" విజయాలు పాలకుల చదరంగం ఆటలో ప్రజల్ని పావుల్ని చేయడానికి మాత్రమే. అయితే ప్రజలు పావులుగా ఉప యోగపడడానికి ఇంకెంత మాత్రం సిద్ధంగా లేరు.

ప్రజలు, ఉద్యమాలతో చైతన్యం పదనెక్కుతున్న ప్రజలు తమకంట్లో కారం చల్లదల్చుకున్న చేతుల్ని శత్రువు కంట్లోకే విసిరి ప్రతి అవకాశాన్నీ ప్రజా రాజకీయాలకు అనుగుణంగా మలచు కోవడంలో మెలకువలు నేర్చుకుంటున్నారు. ఈ మెలకువ ఒక ఎత్తుగడగా ఈ స్పందన ఒక చైతన్యంగా ఈ ఆగ్రహం ఒక పోరాటంగా వర్గయుద్ధంలో సంకులీనమైననాడుగానీ నూతన ప్రజాస్వామ్యం భరోసా.

27-9-84

# అలల అంతరంగం

జాబిల్లి

ఉరుముతున్న కొత్తనీటి ఉరవడి
పాతనీటి మడుగులో ప్రవాహం గడబిడ
పాలనురగతో గోదావరి
ప్రకృతిలో పచ్చదనాన్ని నిద్రలేపుతూ
ఎండిన భూమి కండల్ని కుదుపుతూ
నిండుగా నిబ్బరంగా నినదిస్తూ వచ్చింది
ఆప్యాయంగా పలకరించి
కదిలిస్తే మెదిలిస్తే
అలల అంచుల్లో వెచ్చని కబుర్లెన్నో
ఉబుసుపోక చెప్పుకునేవి కావు
ఆవరిస్తున్న ఉద్యమంగా తనని వివరించేవి
ప్రవాహ ప్రయాణ సంరంభంలో
పట్టు కొచ్చిన తీరం గుండె స్పందనలు
పోరాటం మాటలు పాటలు
దోసిట్లోతీసుకొన్ననీళ్ళలో ప్రతిఫలిస్తాయి
ఒడ్డున విశ్రాంతి పోకడలు పోకుండా
భుజం లోతుల దాకా దిగి
గోదావరీ అంతరంగాన్ని పెనవేసుకొంటే
మన గుండె రహదారుల్లోకి
ఆదిలాబాద్ ఆరణి జ్వాల
ఆటవిక న్యాయం గుండెల్లో శూల
కామ్రేడ్ గజ్జల గంగారామ్
సిరొంచలో భూస్వామ్యం కోరల్నివంచి
అడవిలో ప్రతిధ్వనించిన ప్రజాపోరాట
విపంచి
కామ్రేడ్ పెద్ది శంకర్ల
విలువైనజీవితరహస్యాల్నిసూటిగాపంపి
వర్గకసిని పొందికగా పెంపి

చూపుల్నిపోరాటక్షేత్రాలపై పుష్పిస్తుంది
దాహంతీర్చుకోడానికితన దగ్గరకువచ్చిన
కామ్రేడ్స్కు
రుచికరమైన కొత్తనీటి తియ్యదనాన్ని
అందిస్తున్నప్పుడు
తనతో పంచుకున్న జయాపజయాల
ఆటుపోట్లను
తుపాకీ గొట్టం చెప్పిన ఆత్మవిశ్వాసం
ఊసుల్ని
మావో ఆలోచన విధానం సూక్తుల్ని
నింపాదిగాపట్టుకొచ్చి చెవుల్లో హోరుగా
నిలబెడుతుంది
ఇప్పటి గోదావరిపాతప్పటి గోదావరికాదు
పదునెక్కుతున్న ప్రతిఘటనకు
నమ్మకమైన రహదారి
కదలబారుతున్నఅడవిఉద్యమానికిఆసరా
రాజప్రాసాద కావలి గూండాలకు
ససేమిరా సహకరించని
బిందువు బిందువు తోడైతే
పోటెత్తిన కెరటం జోరు
మాటా మాటా ఒక్కటైతే
విడిపోలేని అయిక్యత హోరు
గోదావరీ అడవీ వొక్కటైతే
చిక్కనైన ఎర్రబాట పోరు
గోదావరికీ
గోదావరి తీరం వెంబడి అడవికీ
అడవికీ
అడవి వొడిలోని గిరిజనులకీ
గిరిజనులకీ

గిరిజనులు చేసిన చేస్తున్న యుద్ధాలకీ
అవినాభావ సంబంధం
చారిత్రిక బంధం వుంది
అచరిత్ర పుస్తకాల్లో వుండదు
అక్కడి చెట్ల బెరడుల మీద డాగుల్లో
గట్ల మీద కమిలిన బాటల్లో
గుట్టల మీద చిద్రుపలైన రాళ్ళలో
పర్వత సానువుల్లో చీకటి నీడల్లో
పువ్వుల్లోని రక్తం వాసనల్లో
గువ్వపలికే విషాద రాగంలో
గూడెంలోని మండే గుండె కొలుముల్లో
వుంటుంది
రాజ్యాంగ యంత్రం ప్రయోగించిన
అమానుష హింసకు చెలరేగిన
రుధిర ప్రవాహం నిండిన
గోదావరి కడుపులోని బడబాగ్నిలో
వుంటుంది
చెవులొగ్గి వింటే
నరాలో హెచ్చే ఆవేశ సంచలన తీవ్రతకు
మెదడు వొణుకుతుంది
కనుపాపల్లో సానుభూతి తడి
సరైన సహకారం కాదు
అవతలి గట్టు చేరుకోవడం మన విధి
గోదావరీ గోదావరీ
మా కళ్ళ దారీ కాళ్ళదారీ
నీ అలల్లో నిండుగా పారే
వర్గపోరు సంగీతం దారే

# ప్రవాహం

కృష్ణ

చిక్క నవుతున్న చీకటి
దిక్కు దిక్కు మనిపిస్తున్నఒంటరితనం
ఎక్కడ్నించో తీతువు కూత
నడుస్తుంటే కాలికితగిలిన
పావురం శవం
గుడిసెలు కాలుతున్న వాసన
గుడిలో మోగుతున్న గంటలు
రోడ్డంతా విశాలం
నడవడానికెవరూ లేనట్లుగా
రోడ్డుకడ్డంగా వ్యానులు
రోడ్లు వీధులై
వీధులు మలుపులై
మలుపులు పాయలు పాయలై
సందులు గొందులై
మురికికాల్వ పక్కనుంచి పోతున్నప్పుడు
కాల్వలో ఇరుక్కొని చంద్రుడు
కాల్వను పరుచుకొన్న వెన్నెల
కాల్వను దాటిన వెన్నెల
బయళ్ళ నిండా వెన్నెల
ఒంటరి తనంలో ఇరుక్కొన్నా
నేను ప్రవాసిని కాను
ప్రవాహాన్ని.

# తల్లిచేప

గోపి

పైన నీలినీలి ఆకాశం.... అక్కడక్కడ అప్పుడప్పుడే మొలుచుకొస్తున్న చుక్కలు, తెల్లగా పాలిపోయి వెన్నెట్లో మిలుకు మిలుకు మంటున్నాయి.... దుబ్బ కొట్టుకపోయిన పాదాలు అడ్డదిడ్డంగా నేలమీదపడుతున్నాయి. చెమటకు తడిసి ఎండిన చొక్కా పడపడమంటోంది ... పొద్దంతా ఎండ, ఉక్కపోత- వర్నాలేదు ఇప్పుడు కొద్దిగా గాలి తోలుతోంది....

దారికి అటుయిటూ పట్నం తుమ్మచెట్లు- కుడిపక్క చెరువుకట్ట- అంటే మేం ఊరికి దగ్గరకొచ్చిన మన్నమాట డేవిడ్ తన ఆలోచనలో తనున్నాడు. "వెన్నెల చల్లగా హాయిగా ఉందికదూ!" అన్నాను. ఎక్కడన్నా నీళ్ళు దొరికితే మొఖంమీద చల్లుకొని, కాసిన్నితాగితే మరింత హాయిగా ఉండేదన్నమాట గుర్తొచ్చింది. డేవిడ్ నా మొదటి మాటవిన్నట్టులేదు. "ఇక్కడేదో చెరువున్నట్టున్నది. కాసిన్ని నీళ్ళు తాగిపోతే" అన్నాను మళ్లీ నేనే....

"ఊరు దగ్గరే.... ముందల మనపనిగావాలి" డేవిడ్ జవాబు

ఇద్దఠం నడుస్తున్నాం .. నాకు ఇంకేదన్నామాట్లాడాలనే ఉన్నది. కాని, దేవిడ్ ఏం ఆలోచిస్తున్నాడో? పాపం దేవిడ్ వయసు ఇరువైమూడో అంతకన్న ఒకటి ఎక్కువో? ఈవయసులోనే ఇన్ని ఆలోచనలు, నాకులేవు.... నాఆలోచనలువేరు. చెట్టునుచూసినా, పుట్టను చూసినా ఏదో పలవరింత ... గునగునాయించుకునే మాటలు.

ఇద్దరం ఊరిబందుకొచ్చాం... ఎడం పక్క చిన్నచిన్న గుడిసెలు బహుశా అవి హరిజనుల గుడిసెలై ఉంటాయి- కుడిపక్క సర్కారు బావి- అలిశ్యంగా ఇల్లు చేన ఇల్లాలొకామె అదరబాదరగా నీళ్లు చేదుకుంటోంది. ఆమె పక్కపిల్లలు అకలికి కాబోలు ఏడుస్తున్నారు. కొంచెం దూరంలో జెండా కనిపించింది. ఆశ్చర్యం. తెల్లగా ఆజెండామీద రాడికల్స్ అని రాసుంది. పోలీసులకు దానిమీద కన్ను బడలేదేమొ? నేనిట్లా ఆలోచిస్తుండగానే డేవిడ్ ఎడమపక్కకు తిరిగిండు. మేంసీదాపోతే అక్కడో చిన్న హోటల్ లాటి దున్నట్లున్నది. అక్కడ రేడియోలో తెలుగువార్త లొస్తున్నయి అక్కడ మనుషులు ఏ విషయం తెలియకుండా మాట్లాడుతున్నారు.

మేం గుడిసెల చూర్లక్రైనీడకింది నుండి. మలుపులు తిరిగి ఊరు చివరకొచ్చాం ఇంత సేపు ఎదురుపడ్డ మనుషులకు మొఖం పక్కకు బెట్టి దేవిడ్ నడవడం నేను గమనించాను.

మేం నడుస్తున్న వాడ గొల్లలవాడ అయ్యిఉంటుంది. మేకల అరుపులు, ఒకవిధమైన గదడ్‌గదడ్ వాసన రావడం కొండగుర్తు. అక్కడక్కడ మేకల పొదులున్నాయి. డ్దేవిడ్ అడ్డదిడ్డంగా ఉన్నగుడిసెలను వాకిళ్లలో కాళ్లబార జాపుకొని గడుక ముద్దలు మింగే మనుషులను తప్పించుకొని ఒక గుడిసె ముందాగిండు. ఆ గుడిసెకు తూర్పువైపు ఇంకోగుడిసెగోడ పడమటివేపు మరో గుడిసెగోడ ఉండి దాని కదే ఎడంగా ఒంటరిగా ఉన్నది. గుడిసెముందు వాసాలు దేలిన చిన్నగుడిసె ఉంది. అందులో కుక్కిమంచమున్నది. అగుడిసె ఛాతీ అంత ఎత్తేఉన్నది....

మా అడుగుల చప్పుడుకు ఒక స్త్రీ గొంతు బెదురుతూ "ఎవలాల్లు" అన్నది:....

"నేనే నవ్వా: డేవిడ్‌ను'' డేవిడ్

ముసలమ్మ పోలీసులనుకున్నదేమొ: గొంతుగుస్తుపట్టి చిరాకిక చెయ్యడ్డం బెట్టుకొని గుడిసెలనుంచి బయటకొచ్చింది. ముసలమ్మ వెన్నెల సంగతి మరచిపోయి నట్లున్నది. దీపం మలిగిపోయింది.

"నువ్వా బిడ్డా సానొద్దులకు" దీపంకిందబెట్టి దేవిడ్ ఒళ్ళంతా పునికింది. నాకేసి ప్రశ్నార్థకంగా చూసింది. నేను ఏమి మాట్లాడాలో తోచలేదు. గుడిసె వెనకవేపున్న చింతమీద కొంగలు కాబోలు రెక్కలు టపటపలాడించి ''కావురు కావురు''మన్నాయి

డేవిడ్ నాగురించి ఏమి చెప్పిందో నాకు వినపడలేదు

ఇద్దరం వంగి గుడిసెలోపలికి నడిచినం, గుడిసెచాలా చిన్నది. దండెంమీద, చిరిగిన పేగులు, గోడకు వేసినచాట మూలకు మట్టివంట పాత్రలు.... ఇంకోమూలకు కోళ్ల గూడు ...

''అవ్వా సెమటకు ఉప్పుదేలి సిటసిట బెడ్తుంది''.... డేవిడ్

"పోరడు ఏడబోయిండో, బాయికాడికిబొయి జెట్న నీళ్ళుసేదుకత్త. మీరట్ల మాట్లాడుకుంట కూకుండుండ్లి" కుండ చేతిలోనికి తీసుకున్నది

"గీనాత్రి నీళ్ళెందుకంట ఎవలన్న అడుగుతె" డేవిడ్

"అళ్ళంట్ల పీనై : లకుబోయి గిప్పుడే అచ్చిన్నంట" అవ్వ వెళ్ళిపోయింది

డేవిడ్ వంటపాత్రలు తనిఖీ చేశాడు. గడుకెసులల సలిగడుక కొంచెమెఉన్నది అంగీలిడుసుకున్నాం.... అవ్వ నీళ్ళ కడువతోపాటు కొంగులో కాసంతపొడి గడుక తెచ్చింది.

మేమిద్దరం ఆటక్క కుండెడు నీళ్ళతో మొఖాలు కడుక్కున్నాం. అవ్వ పొయ్యింటిచ్చింది. మోకాల్లమీద తలబెట్టుకొని అవ్వ పొయ్యిదగ్గర కూర్చున్నది. మేమిద్దరం కొంచెం దూరంలో సంచిబొంత పరుచుకొని కూర్చున్నాం.... ఇంతలోకి అవ్వ రెండోకొడుకు దుబ్బకాళ్ళతో గుడిసెలకొచ్చాడు. రెండు భుజాలు చిరిగిన అంగీ వేసుకున్నాడు. చెంపలమీద మాంసంలేక ఎముకలు తేలున్నాయి. కండ్లు మాత్రం చాలా చురుకుగా, చిత్రంగా ఉన్నాయి.

"గింతనాత్రిదనుక ఏడరాజ్జేలేలత్తివి"? అవ్వ. అది ప్రశ్నకాదు. కొడుకు జవాబు చెప్పలేదు. డేవిడ్‌కు లాల్‌సలామ్ చెప్పి పక్కనే కూలబడ్డాడు....

గడుక ఎసులలో నీళ్లు తుకతుకలాడటంతోటి మూతతీసి గడుకపోసి తెడ్డుతో కలిపి మంటదీసింది.

"ఈటికి నాలుగు పారీలచ్చిరి బిడ్డా! మేం దొంగలమైపోతిమి" అవ్వ....

వచ్చిందెవరో డేవిడ్‌కు అర్థమయ్యింది.

"ఏమంటరవ్వ"?

"పీరీలకల్లైతీర్గఉన్న బక్కోడంటడు"

"ముసలిముండ మంచిమంచోళ్లు మన్నయిపోతండ్లు. మీ ఊళ్లో గ రామ్‌రెడ్డి నూ వా? ఇదంత కానిదిపోనిదని చప్పుడు చెయ్యక ఉంటలేదా? నీకొడుకే దండి

మొగోన్నని ఎగురుతుండు. కనిపిస్తే కాల్చెయ్యమని అర్డరు.... పిచ్చిదానా అనికి లేకున్నా నీకన్నా జ్ఞానం ఉండాలెనే ఎర్రిగొల్లోనికి ఏమెరికనే!'' అన్నడు....

''నువేమన్నవ్''

"ఏమంట బిడ్డా! అన్నిగన్నగని ఆనిరాతనుగన్ననా?" అన్న ...

"ఆనెంటొచ్చిన గుమ్మటంలాంటోడు ముండా నాతిరి నీయింటికత్తడంటగదా పోలీసోని కండ్లుగప్పి ఎంతకాలం తప్పకుంటడే" అన్నడు

"అత్తె ఏడుంటడు నాదేమన్న అర్రలున్న మేడామిద్దా పట్టుకోరాదుండ్లి అన్న నేను...."

"మా అవ్వను బుడరకిత్తండ్లు" అన్నడు ఆమె చిన్నకొడుకు

ఆతరువాత గడుకదించింది.... గిలేటుపల్లేలిద్దరికి పెట్టింది. "కాదు అందరం తలాకొంత తిందామన్నడు డేవిడ్", అదే మంచిదనిపించింది. కాని పల్లేలున్నట్టులేదు డేవిడ్ గడుక కుండమీది మూకుడు తీసుకున్నాడు. ముసలవ్వకొడుకు గిన్నె తెచ్చుకున్నాడు. చలిగడుక ముసలవ్వ పెట్టుకుంటనంటే తలాకొంత పంచుకున్నాం. చింతకాయ తొక్కు....

అందరం తింటున్నాం. నేను తింటూతింటూ ముసలవ్వకేసి చూశాను. చాలా ఎత్తుమనిషి నల్లగా, కాయగాసిపోయిన దేహం, చెక్కుకుపోయిన చెంపలు, చిరిగిన గుడ్డలు గాజుకండ్లు మొత్తానికి ఆముసలితల్లి కష్టాలుపడి బాగా అలిసిపోయినట్టున్నది. కాని ఆకష్టాలనే తలుచుకొని తలుచుకొని ఏడుస్తూ, దిగాలుపడి కూచున్న మనిషిలాగా లేదు.... బతుకున్నంత వరకు కష్టాలుంటాయని ఏదైతె అదైతదని తెగించి ముందుకు నడిచే వీరయోధురాలులాగా అన్పించింది. ఏమో నా అనుభవం, వయసు ఆమెను అంచనా కట్టడానికి సరిపోవేమొ అనుకున్నాను....

అవ్వ మాఇద్దరి ముఖాలకేసి చూసింది. అచూపులో ఏముందో నాకు తెలియలేదు. డేవిడ్ చలిగడుకకానిచ్చి ఉడుకుగడుక ఊదుకుంటు తింటాడు.

'బిడ్డా కోప్పడరుగదా!' అన్నది అవ్వ

డేవిడ్ తిండాపి "అట్లంటవేందవ్వా!"

"కాదు కొడుకా నామనుసుల ఎప్పటినుంచో ఓమాటున్నది, ఎవలనడుగాలో దోత్తలేదు...." అవ్వ చెయ్యికడుక్కొని మాకు మరింత వడ్డించింది.... పొయిల పుల్లొకటి తీసుకొని దాన్ని అటుయిటూ తిప్పింది- మళ్ళీ పొయిలేసి ఊదింది. గుప్పున మంట లేచింది.

"బిడ్డా జెరంత సెవునబెట్టు- మా అయ్యావ్వకు నేను పెద్దబిడ్డను- నా ఎను- ఇద్దరినికని మాఅవ్వ సెల్లిపోయింది. గసిన్నతనంలనే ఇంటిపెత్తనమంత మీదబడ్డది. పెండ్లయ్యేదనుక సిడెంసేపు రికాంలేకుంట కట్టవడ్డ. పెండ్లయినంక గీడగదె వుల్లెందల కట్టమో నిట్టూరమో కలిసి ఎల్లబోత్తామనుకుంటె దేవుని గుల్లెరాయిపద పోల్లగండ్లు కండ్లు దెరువకముందే అయినె మందకాడిది మందకాన్నె పాముగుట్టి సెల్లిపోయిండు- ఇగబిడ్డా సీతసెరలచ్చినయ్. మంద మన్నయిపోయింది. ఇద్దరు పోరగండ్ల కడుపుకు గట్టుకొని సాదుకచ్చిన. తిన్ననో? కంటినిండ నిదురేతీసినో్న ఎండల్లవానల్ల సలిల ఉపాసాలుప్పిల్లున్ననో గ భగవంతునికెరుక. ఏదో ఏగిచ్చుకచ్చిన. పిలగండ్లకు రెట్ట ముదిరింది. భగవంతుడా గంపంత కన్నుబెట్టుకొని ఏడున్నవో? ఇకనైన నా కట్టాలు కడతేరినయనుకున్న బిడ్డా! నావొం బెజిగిసచ్చింది. నాకండ్లల్ల నీల్లింకినంక నా సెత్తల నెత్తురు సచ్చింది.... నా సెట్టెత్తు కొడుకు మిమ్ములకలిసిండు...." అవ్వ కంఠం వనికింది. ఆ ముఖం చూసి నాకళ్ళల్లోకికూడా నీళ్లూరినయ్....

అవ్వ మాట్లాడలేదు. డేవిడ్ అడుగలేదు.... మా తిండ అయిపోయింది.. అందరం బయటకొచ్చి చిన్నగుడిసెలో కూర్చున్నాం....

అవ్వ కళ్లొత్తుకుంటూ వచ్చి కింద కూలబడ్డది. ఆమె ముఖంమీద గుడిసెకప్పు రంధ్రంగుండా వెన్నెలచారపడుతోంది

"పేదోల్లు సుఖపడాలె కాదనను- పేదోల్ల రాజ్జెం రావాలె- నాకన్నా ఎవల కెక్కువ సంబురం.... దొరల దుట్టితనం బోవాలె- ఎందుకంటే నాసిన్నతనం నుంచి దొరల తన్నులు తాపులుపడ్డ.... అకటికి సచ్చిన- బిడ్డా గదానికి నాకొడుకే కావన్నా! రవ్వంత సుకం గీ ముసలిముండకు గావన్నని కోరుకునుడు తప్పాబిడ్డా!" అవ్వ ఏడుస్తోంది....

"వద్దవ్వా నువ్వేడువద్దు- నీకష్టాలు, కన్నీళ్లు- కాదుకాదు ప్రపంచంలో కష్టాలు కన్నీళ్లు ఉండొద్దనే నీచిన్నారి కొడుకులం పోరాడుతున్నాం అవును మేం ఇనుప మూతి కొడుకుల మధ్యనే ఉన్నాం. తుపాకులు, టాంకులు ఎన్ని ఉంటేనేంది... ఇన్నేళ్లు పశువులకన్నా హీనంగా చూడబడ్డవాళ్ళం తెగించి పోరాడుతున్నాం. మనం పొట్టచేతబట్టుకొని సంవత్సరాల తరబడి దిక్కూ-మొక్కూ లేకుండా తిరిగితిరిగి వేసారిపోయాం"

నా మనసులో ఎన్నో మాటలు ఇలాంటివే పోటెత్తుతున్నాయి. నేను పుస్తకాల నుండి అవ్వదగ్గరికొచ్చినవాన్ని- ఈమాటలు అవ్వకు తెలుస్తాయా? అసలు అవ్వ కోరే దేమిటి? తన్వంత సుఖం- ఈముసలి వయసులో కాసంత విశ్రాంతి.... అడితప్పా! ఆమె అలిసిపోయింది.... విసిగిపోయింది. విప్లవం కావాలి- కానిఈబీదతల్లి కొడుకే ఆ విప్లవానికి కావాలా?

"ఎవలను వాళ్లే విముక్తం చేసుకోవాలే అవ్వ- ఎవలకష్టాలకు వాళ్లే తెగించి పోరాడేలే అవ్వా?" అనాలనుకున్నాను... ఈ మాటలకర్థమేమిటి? మాటలకోసంగింజు కున్నా- అవ్వ కర్థమయ్యేలాగా ఎట్లాచెప్పాలి?

డేవిడ్ ముఖం ప్రశాంతంగా ఉన్నది. బీడి ముట్టించాడు....

అవ్వ రెండోకొడుకు అవ్వ మాటలకు కదిలిపోయినట్లున్నాడు. అతనికి ఆ మాటలకు జవాబుకావాలి అన్నట్టుగా ఉన్నాయి అతని చూపులు....

బీడి అయిపోయింది- "అవ్వా నాకు కాసంత పనున్నది. నేను పోయొస్త మాట్లాడుకుంట కూకోండ్లి...." డేవిడ్ గుడిసెల కై నీడల్లో కలిసిపోయాడు.

నేను ఇరుకునబడ్డాను.... అవ్వను అవాస్తవికంనుంచి తప్పించేందుకు ఏదోవొకటి చెప్పాలనుకున్నాను. ఏదీ చెప్పలేకపోయాను. డేవిడ్ పదినిమిషాల తరువాత తిరిగొచ్చిండు....

కాళ్లూపుతూ మంచంమీద కూర్చున్నాడు- సన్నగా గొనుగుతూ "వెన్నెల రాత్రిల్లో వలలో అన్నాలొచ్చిండ్లు' అంటూ పాడాడు.... డేవిడ్ గొంతు బావుంటుంది హఠాత్తుగా పాటాపి "అవ్వా ఏదన్న కథ చెప్పరాదు.... నువ్వేం చెప్పుతవులే నేనే చెప్పుత...." నవ్వుతూ.

"నీకు ఏడుపురాదా బిడ్డా!" అవ్వ తేలికగా విట్టూరుస్తూ....

అదేమి పట్టించుకోకుండా "వినవ్వా! అయింక నన్ను అంటవ్.... తమ్మి నువ్వు సుత వినరా!" అంటూ మొదలేసిండు....

డేవిడ్ గొంతు మారిపోయింది. పొతదికారు కథ చెప్పినట్లుగా రాగయుక్తంగా 'అవ్వా! అన్ని చేపలు బుట్టినట్లుగానే సందమామ చేప పుట్టిందట- పుట్టంగనే దానికి బండెడు కష్టాలచ్చినయట- చేపకట్టం చేపదనకు- అది ఈదరాని మడుగులన్ని ఈదిందట- కాలువల్లనుంచి వాగుల్లకు, వాగుల్లనుంచి సెరువుల్లకు- అవ్వా! అది తిరిగి తిరిగి వేసారిపోయింది. ఎక్కడసూసినా గదేబతుకు- దాని పక్క చేపలన్ని వేటాడబడ్డయి. వలల సిక్కేటియి సిక్కినయ్- నీళ్ళకింద, ఉసికెకింద ప్రవాహం కిందా సచ్చేటియి సచ్చినయ్.... అయినా మొండిచేప కాలానికి కట్టానికి ఎదురునిలిసి బతికింది- వేటగాళ్ళకు చిక్కకుండా తప్పిచ్చుకున్నది- దానికి ఇద్దరు కొడుకులు. ఇద్దరు కొడుకుల బట్టుకొని ఏటికెదురీతె ఆటికి ప్రమాదం వెంటబడగా తప్పించుకుంటూ చివరకు ఓమడుగు చేరింది.' డేవిడ్ ఆపిండు.

అవ్వ ముఖం వికసించింది.... అవ్వ రెండో కొడుకు డేవిడ్ పక్కకొచ్చి కూర్చున్నాడు....

"అవ్వా! మరింక ముసలిచేపకు అలసటొచ్చింది....'భగవంతుడా! నాబతుకంతా తిరుగడమే సరిపోయింది. ఇప్పటికన్నా ఈముసలిదానికి కొసంత సుకం ఇయ్యి తండ్రీ!' అనిరోజు భగవంతునికి మొక్కుకునేది. కాని భగవంతుడు ముసలిచేప మొర ఆలకించలేదు మడుగులో నీళ్ళు రోజుకొన్ని ఎండిపోసాగినయ్. ముసలిచేప పెద్దకొడుకు తల్లితో తిరిగి కొంత లోకజ్ఞానం సంపాదించాడు. ఎప్పటికైనా ఈ మడుగు ఎండిపోగలదని, మడుగులో జీవితం ప్రమాదమైనదని ఎప్పుడో ఒకప్పుడు చేపలమీద వల విసరబడుతుందని గ్రహించాడు.... కనుక మడుగును కాలువను కలిపే నీళ్లధార ఎండిపోకముందే బయటపడటం మేలని గ్రహించి తల్లికి చెప్పాడు.

తల్లిచేప విరక్తిగా "బిడ్డా! నాబతుకంతా తిరిగి తిరిగి అలసిపోయాను.... నేనెంత అలిసిపోయానంటే ఈమడుగులో నుండి ఒక్కడుగు వేయజాలను.... బిడ్డా

బయట ఏముందో? ఇంతకన్నా సుఖంఏదలేదు.... నాబతుకే అందుకు సాక్ష్యం.... మనబోటి వాళ్ళకు ఏడికిబోయిన ఏదే మానుకలు. నువ్వు ఈముసలి వయసులో నన్ను విడిచిపోవద్దు" అని ఏడ్చిందట....

అప్పుడు పెద్దకొడుకు "అవ్వా ఎండకాలంపోయి వానకాలం వస్తుంది.... మబ్బులు కుదురుకుంటాయి.... కాలం మారినట్టుగానే మన బతుకులు మారుతాయి. ఇక్కడుంటే మనం గిలగిలతన్నుకొని చావాల్సిందే" అన్నడట....

"నువ్వు కోరి ప్రమాదాన్ని తెచ్చుకుంటున్నావ్ బిడ్డా!" తల్లిచేప.

'రెండోకొడుకు చేప ఏమనలేదా?' అవ్వ రెండోకొడుకు ప్రశ్నించాడు.

'ఏమనలేదట– అబుల్లిచేపకు తల్లిమాట బాగానే కన్పించింది– అన్నమాట బాగానే కన్పించింది– ఎటూతేల్చుకోలేక పోయిందట' దేవిడ్.

'అమ్మయ్య' రెండోకొడుకు నిట్టూర్చిండు....

'మరింక విధిలేక తల్లిని తమ్ముణ్ని విడిచి పెద్దకొడుకు తనదారి తాను చూసుకున్నడట– మడుగులోనుంచి వెల్లిపోయిండట– మడుగులన్నీ తిరుగాలి, వాగులన్నీ తిరుగాలి– చేపలజాతికి ప్రమాదంలేని మంచిబతుకు ఎట్లాగన్నా కనుక్కోవాలి. ఈ పనిలో అవసరమైతే ఏదైనా చేయాలి– తన తల్లికి సుకం కావాలి....'

కాలం గడిచిపోతోంది మడుగును కాలువను కలిపే నీటిధార ఎండిపోయింది. ముసలిచేప భగవంతుణ్ని పార్థిస్తూనే ఉన్నది. దానిమనుసులో పెద్దకొడుకు అన్నమాట 'అవ్వా మనమీద ఏక్షణాన ప్రమాదం వల రూపంలో పడుతదో?' అనుకున్న ప్రమాదం రానేవచ్చింది. ఒక బెస్తవాడు మడుగులో వల విసిరాడు.... అప్పుడు రెండోకొడుకు చేపకు ఏమి చేయాలో తోచలేదు. అన్న చెప్పినమాటవిని– అన్నతో వెళ్లిపోతే బావుండేది. కాని తల్లిమాటమీద నిలబడ్డాడు. అయినా ఏదైనా ఉపాయం చూడాలి వలను బయట నుండి పళ్ళతో కరిచిపట్టుకున్నాడట– బెస్తవాడు వలనుతీసి తేటనీళ్ళల్లో కడిగిండట– ముసలిచేప రెండోకొడుకు నీళ్లకాలువలో కలిసి అన్నను వెతుక్కుంటూ వెళ్లిపోయాడట.

అవ్వా! అలిసిపోయిన ముసలిచేప, బతుకంతాకష్టాన్నే చూసినతల్లిచేప, రవ్వంత సుకం కావాలని రోజుభగవంతున్ని కొలిచిన తల్లిచేప- కొడుకు పసికట్టిన ప్రమాదాన్ని తెలుసుకోలేక బెస్తవాడికి చిక్కింది....

అవ్వా! నీసుఖం దుఃఖం తొలిగేదారి నాకు నీకొడుకే చూయించిండు ... నీకు నీకొడుకె చూయించిండు... నువ్వన్నట్టు అదారిలో పోకపోతే ఇనుపమూతి కాకులు మనకు సుకాన్నిస్తయా? నీకొడుకేకాదు ... అవ్వా నువ్వూ రావాలెనమ్మా"

డేవిడ్ లేచినిలుచున్నాడు.... నాకు అక్కడి వాతావరణాన్నిగాని, అమ్మ ముఖంలోని భావాన్నిగాని, ఆమెరెండోకొడుకు ముఖంలోని ఆలోచనలనుగాని చూడటానికి భయమేసింది....

మేమిద్దరం గుడిసెలుదాటి ఊరిబయటకొచ్చాము.... కట్టచివరికొమ్మకు అయిదుగురు రైతులు కూర్చుండి ఉన్నారు.... అంతకన్నాముందు ఆఅయిదుగురిలో ఒకడు మాకు కొంచెందూరంలో ఎదురుచూస్తూ కనిపించాడు.... మమ్మలిద్దరిని మిగతా వల గురిదగ్గరికి తీసుకవెళ్లాడు.... తరువాత ఆరైతులతో డేవిడ్ చాలా రాత్రయ్యేదాకా మాట్లాడాడు....

  

రెండు నెలలు నేను అవ్వనుగురించే మరిచిపోయాను.... రెండు నెలల తరువాత ఒకనాడు పత్రిక చదువుతుండగా నేను డేవిడ్‌తో కలిసివెళ్లీన ఊరుగురించి రిపోర్టు వచ్చింది.

ఆ వూళ్లో పోలీసులు క్యాంపు బెట్టారట- ఆక్యాంపులో జనాన్ని "మంచి నీళ్ళడుగుతే మూత్రం పట్టి బలవంతంగా తాగించడం, అన్నం అడిగితే మలం తినమని మరుగుదొడ్డికి తీసుకవెళ్లటం, రోలర్ ట్రీట్ మెంటులకు గురిచేయటం తలకిందుల వేలాడదీసి గంటల తరబడి అలాగే వుంచటం- ఒకరిచేత మరొకరిపై మూత్రం పోయించడం, వలయాకారంగా కూర్చుండబెట్టి ఒకరిచేత మరొకరిని చెప్పులతో కొట్టించటం, నగ్నంగా వుంచటం.... చిత్రహింసల పరంపర తర్వాత....

అవ్వను అరెస్టుచేసి "నీకొడుకు బాంబుల్ని ఎక్కడ దాచాడో" చెప్పమని పోలీసులు వేధించారు. తనకు అవిషయం తెలియదని అవ్వ మొత్తుకున్నా వినకుండా క్యాంపుకు తీసుకవెళ్ళి విపరీతంగా కొట్టారు. ఆమె స్పృహతప్పి పడిపోవడంతో తలకు గాయమయ్యింది. దెబ్బలు భరించలేక ఆమె ఆత్మహత్య చేసుకోవడానికి ప్రయత్నించి స్పృహకోల్పోయింది.... హాస్పిటల్‌లో చేర్చారు".

నా మనసు విలవిలలాడింది. డేవిడ్ చెప్పిన మూడుచేపలకథ గుర్తొచ్చింది. ఇంతతొందరగా డేవిడ్‌కథ నిజం కాగలదని నేనూహించలేదు.

దెబ్బలుతిన్న అవ్వనూహించుకుంటూ నేను హాస్పిటల్ గేట్లోకి అడుగుపెట్టాను అప్పటికి రోగుల బంధువులు హాస్పిటల్ నుండి ఇళ్లకు తిరిగిపోతున్నారు ... చూడ వల్సిన సమయము అయిపోయిందన్నట్లుగా లావుపాటి వార్డుబాయ్ గంట ఊపుతున్నాడు.

బెదురుబెదురుగా నేను స్త్రీల వార్డులోకి అడుగుపెట్టాను.... అవ్వను కనుక్కో-వడం అంత కష్టంకాలేదు.... నేను అవ్వ మంచందగ్గరికి వెళ్ళేసరికి కంపలాటి తల గల ఒకపేదస్త్రీ అవ్వపక్క నిలబడిఉన్నది....

అవ్వతలకు తెల్లటి గుడ్డలు చుట్టబడిఉన్నాయి. ఎడంచేయికి సిమెంటు పట్టి వేసున్నది....

"అవ్వా నేనొచ్చాను...." నాగొంతు నాకేవిచిత్రంగా....

అవ్వ కళ్లు విప్పింది.... ఔను నన్ను గుర్తుపట్టింది ... నరాలుతేలిన కుడిచేయి ఎత్తి నన్నుపునికింది.... నాకు దు:ఖం వస్తోంది.... కాని ఏడవకూడదు ... ధైర్యంగా ఉండాలె అలిసిపోయిన అవ్వకు నాదు:ఖం కనిపించకూడదు

"బిడ్డా! నీళ్ళదార తెగినమడుగు ఎండిపోతది.... సేపలు నీళ్లల్లనే బతుకతయి వెనక్కి రావద్దనిచెప్పు.... నాతీర్గ ఒలల సిక్కొద్దనిసెప్పు.... పేదదాన్ని, బతుకంత కట్టాలు పడ్డదాన్ని.... బిడ్డా మసలిదాన్ని వొలలబడ్డ. పెద్దోడు చెప్పిందికానలే.... పెద్దోడుకల్సిన నీళ్ళధారలనే సిన్నోన్ని పొమ్మనిచెప్పు.... నేను బతికిబట్టకడుతే, మీ యవ్వ మరింక ఎన్నడూ వొలల సిక్కదని చెప్పు...."

అవ్వ చెక్కిళ్లమీద కన్నీళ్లు.... పక్కనున్న పేదస్త్రీ ఏడుస్తోంది....

నేను వెనక్కి తిరిగి అవ్వసందేశాన్ని మోసుకొని బయటకు నడిచాను....

## సవారీ

తుమ్మేటి రఘోత్తమరెడ్డి

(ఇదేపేరుతో ఒకకథ 1981 నవంబర్ సృజనలో వచ్చింది. బావపురది అర్జంటుగా రమ్మనిరాస్తే బండిమీద సవారీఅయి బయల్దేరాడు ప్రతాపరావుదొర. బండి ముందు పరుగెత్తాల్సిన చాకలి తనభార్య అప్పుడే ప్రసవించటంతో ఏదన్నా అవసరం వస్తుందేమోనని తాను ఇంటిదగ్గరేవుండి తనకొడుకుని పంపిస్తాడు. వాడు చిన్నపిల్లాడు వేగంగా పరిగెత్తే గిత్తలకన్నా వేగంగా పరిగెత్తటంలో అలసిపోతాడు. మెల్లిగా పరిగెత్తితే గిత్తలకాళ్ళకింద నలిగిపోతాడు. ఇంతలో జనసమూహం, ఆసమూహంలో ఎర్రజెండాలు వూరిపొలిమేరల్లో కన్పిస్తాయి ప్రతాపరావుదొరకి. ఎదురుగా వచ్చే వాణ్ని అదేమిటని అడుగుతాడు. అమీటింగు సంఘపోళ్ళది అనిఅతడు చెప్తాడు. దొరకొంచెం ఆలోచించి చాకలికుర్రాణ్ని తనతోపాటు బండెక్కమంటాడు. వాడు నమ్మలేనట్టుచూస్తాడు. దొరకోపంగా "ఎక్కరా గాడిదీ-ఎక్కు, ఎక్కమంటె చెవులు ఇనపడ్తలేవ్?'' అంటాడు. అకుర్రాడు బండీఎక్కి భయంభయంగా కూచుంటాడు. బండి మళ్లీ 'సవారీ' మొదలెట్టింది....)

యిందాక బండెనుక వురికిచ్చుకొని యిప్పుడెందుకు బండ్లె ఎక్కించుకున్నడో ఓదెలుకు తలకాయ పలగ్గొట్టుకున్నా అర్థంగాలేదు. ''సియవ్వ.... వూరుదాటినంక ఎక్కిచ్చుకుంటడనుకుంటి!.... తాల్లల్ల గౌండోళ్ళు, కల్లు దాగచ్చినోళ్ళు సూత్తరు గదాని తాళ్ళదాటినంక ఎక్కిచ్చుకుంటడనుకుంటి, అనీపాయె, తోటలు పెరండ్లు సేన్లు సెలక్కలుదాటినా ఏడటక్క వురుగుకనబడక పెయినా బండెక్కిచ్చుకోకపాయె. అఖరికి వూళ్ళకు వూళ్ళుదాటితిమి అం....ముందురకుమనె ఎనుకకురమ్మనె మొసనక దమ్మనక వురికినా బండిపొంటై అందకపాయె! కోడెలెట్లున్నయి? మొద్దులతీరుగ బలిసి గుర్రాల తీరుగ వురుకబట్టె.... వురుకక ఏంజేత్తయి? పనాపాటా? బగ్గతినుడు సవారి పెనాలు చేసుడు నాగలానట్టా! వాటికి పన్లేదు యీలంజకొడుక్కి పనిలేదు.... తినుడు తిరుగుడు

ఎక్కడెవనికొంప ఎట్లముంచుడు యిదేపని. ఎనుకట బండిముంగిట సాకలోడు బండె నుక మంగలోడు, వానెనుకనే "బరిసె" కట్టెపట్టుకొని సుంకరోడు గట్లపొయ్యేదట పీనిపోకడకాలిపోను. సాగత్తె పగంరాజ్జెం ఏలుతనంటరు!"

ఓదెలు ఆలోచనలు అట్లున్నయి పర్తాపరావుదొర బండెక్కుమని గుడ్లు తెరు వంగనె బయంబయంగ అనుమానంగఎక్కి పిల్లికూనతీరుగ ఒదిగికూసున్నడు. బలిసిన ఎడ్లాయే దొరకోపంమీదుండె బండి వురుకుతాంది. తొవ్వంత గెగ్గెలు గెగ్గెలు అటూ యిటూ లోపుతాంది. ఎనుకకాళ్ళు దగ్గెర పెట్టుకోని కూసున్న ఓదెలుతల బండితడుకకు యిటూఅటూ తలుగుతాంటె గుండు ఝణుక్కుంటాంది. "మొద్దుతీరుగ కూసున్నడు ముందట మెల్లెగపోనిత్తెందో?" మనసులఅనుకున్నడు. బండ్లె యీపక్క ఆపక్క లోపుడే యింతమంటంటె అదువారదాక వురికచ్చి వురికచ్చి కాళ్ళదగ్గెర పెట్టుకొని కూసుండెవరకు సలిపినట్టు ఒకటేబాధ ఎండనక దుబ్బనక మన్ననక మళ్ళానమనక పాపం ఖోరడు ఎంతదూరం వురికచ్చిండో? ఓదెలుసూపు అవుతలికి బడ్డది తడుక బయిటికి తలపెట్టి అపక్క యీపక్క అచ్చేమనుషుల్ని చూస్తున్నడు. అంతమంది జనం అక్కడ ఎందుకు కూడతం[డోనని ఆశ్చర్యపొయిండు. ఏనంగ అత్తాండో్రి పుట్టచెదిరినట్టు ఒకటే జనం!

తొవ్వలేకుంట దారిలేకుంట ఏనంగ పీలై తెఆనంగ పాటలు పాడుకుంట దంటలు పట్టుకోనికొందరు, సప్పట్లుకొట్టుకుంట కొందరు సంతోషంగ సంబురంగ ఏమచ్చుదో అచ్చుడు. ఎర్రెర్ర జండాలు పట్టుకోని దూరంగ వూరుముందట సముద్రిమోలిగె జనం.... జనం మధ్యనుంచి గాలిలతేలి "బన్రింకొడుకో...." పాట వినబడ్తాంది.

సుట్టు పదూళ్ళపెట్టునుంచి వచ్చేజనం అస్సలస్సల్‌పాటలు పాడుతాంటె బండ్లె కూసున్న ఓదెలు పానం నిలబడ్త లేదు. అపాటలన్ని తను విన్నయే గాయె వూళ్లెకు బట్టలకచ్చినా బువ్వకచ్చినా సెర్లబండమీద బట్టఉతికినా ఆరేసినా యీతగొట్టినా దున్నపోతుల కాయబోయినా అవ్వేపాటలాయె! ఓదెలు నాలుకమీద ఆడుతానయ్ అటు ఇటూ బుజాలెగురేస్తున్నడు "సీయవ్వ దునికిపోతె బాగుండు" అని అనుకున్నడు. కని మళ్ళ బాధ్యత గుర్తొచ్చిందోఏమొ? "అబ్బో యీలంజకొడుకో యింటికిపెయినంక అయ్య వూకుంటాడు, పెద్దలొల్లి"

అచ్చేజనాన్ని సూసుకుంట దొర అగ్గిమీదగుగ్గిలం అయితాండు. "సీఁల్లి కాలం పెండ్లాం...'' అని షెదుములు కొరికి నారుకట్టెతోని వలుపటిదా న్నోదెబ్బ దాపటి దాన్నోదెబ్బ ఏసిండు. తోకమట్టలు వూపుకుంట వురుకుతానయ్ఎడ్లు. బండి మీటింగు దగ్గరిదాక పోయింది. మైకుముందట ఎవలోకని యీడికాడికి యీరంగమేసినట్టు దునుక్కుంట పాటలు పాడుతాండు. ఒక్కొక్క పాట యింటాంటె దొరకు పెయినిండ కాల్లుపెట్టి కారం అద్దినట్టు అయితాంది. "ఏంజేసెటట్టున్నది ఒకళ్లాయిద్దరా ఎగిడిసినట్టు వెయిలకు వెయిలజనం పూళ్ళకుపూళ్ళు కదలిఅచ్చినట్టు వుసికపోత్తె రాలకుంట"

ఊళ్లెకు పొయేతొవ్వ యిడిసిపెట్టి, తొవ్వకు యీపక్క అపక్క నిలబడ్డరు జనం. కంకకట్టెలు పట్టుకోని అందర్ని కూసొమ్మని, తొవ్వపొంట పొయెటోళ్ళకు జాగ యియ్యుమని సెప్పుతాండ్రుకొందరు. వినెటోళ్లు పాటలింటాండ్రు. మీటింగు గురించి అమీటింగుల నాలుగుముచ్చట్లు చెప్పుటానికచ్చిన సార్లగురించి కొందరు మాట్లాడుకుంటాండ్రు.... సబ్బండ వర్ణాలజనం భూమిదద్దరిల్లినట్టు.... జనాన్నిచూచి ఎడ్లు నిమ్మళానికచ్చినయి. కస బెదిరినయ్. పగ్గాలు దగ్గెరపట్టుకోని పండ్లు బిగవటి కండ్లుసన్నయిచేసి, మొగడుకొట్టిన పెండ్లాంతీరుగ మొఖం ముడుసుకోని దొర బండితోలుతాండు. దొరకేమొ నిప్పులమీద నడిసినట్టు ఎప్పుడు బయటపడ్తె బాగుండునని మామూలుగనైతె యిట్లఎండ్లు బెదురుతాంటె సాకలోడు పగ్గాలు పట్టుకోని బండి ముందట నడువాలె! "యిన్నేండ్లకు సాకలోన్ని బండెక్కిచ్చుకోవలసిరావట్టె ఎంత నాదాన్? ఎందరేమనుకుంటరు రేపు మొఖమెట్ల ఎత్తుకోని తిరుగుడు? పోరడయెపటికె సరిపెయింది" దొర బండిని పదిలంగ మందిమధ్యనుంచి నడిపిత్తాండు. శానమంది బండిని ఎండ్లను అతరువాత దొరను గుర్తువట్టిండ్రు. ముందటఎనుక ఎవడు లేక పోయెవరకు అశ్చర్యపెయింగ్రు "వీడేంది సాకలోన్ని బండెక్కిచ్చుకునుడేంది?" ముసలోడొకడు నోరుతెరిసిండు. "ఎక్కిచ్చుకోకపోతే ఏంజేస్తడు సంకనాకుతడా?" పడుసోడొకడు ముసలోని బొక్కినోరు మూసిండు.

"ఎనుకటికాలం బెయిందిరముసలోడా గిట్లసునమందరం కూడిందిలేదు వాడుగట్ల పిల్లికూనై పెయిందిలేదు. సలిసీమల సేతజిక్కి సావదె సుమతీ అని పజ్జెంగట్టినోడు గింత గాయిదోడు అయికట్టలేదు". కట్టెమీద బరువు ఆనుకుంట చెప్పుకచ్చిండు నడీడు మనిషొకడు.

"బుడ్డ గోసులోళ్ల ఏకమైనంక నూరుమంది పశాపరావు లైతేంది యిన్నూరు మంది పశాపరావు లై తేంది వనవాసంబట్టరే?" పోరనికి రొమ్ముదీసి నోట్లెబెట్టుకుంట లడలడ సెప్పిందొకామె.

జనం మర్రి మర్రి చూసిండ్రు, మిర్రి మిర్రి చూసిండ్రు, కండ్లెర్ర చేసిండ్రు. అబ్బో! ఎన్నేండ్లవట్టి అణిగిన కోపమో! పడుసు పోరగండ్లు కొందరు కిస కిస నవ్విండ్రు. దొరకు అందరు కలిసిహేలన చేసినట్టు అయింది. ఓదెలుకు కొద్దిసేపు పాట విని పోతే బాగుండనిపించింది. "కొత్త కొత్త పాటలు ఏంజోరుగున్నయి, తరీ ఖంబడి ఎట్లపాడుతాండ్రు." బండి మెల్లగ జనాన్ని దాటింది ఊళ్లెనుంచి జనం అచ్చుడు తగ్గిపెయింది. మీటింగు మొదలైనట్టున్నది. మైకుల పాటలు బందైనయి "మళ్లేం జరుగుద్దో పోతె బాగుండు" ఓదెలు ఆరాటం ఓదెలుది. పాపం దొర గావర దొరది.

బండి జనానికి కొంచెం దూరమైంది. ఊరుపక్క సింతసెట్లల్ల సొచ్చింది. దొర బండాపిండు. అందాక ముక్కు మూసుకోని భరించినట్లు ఎనుకకు మర్రిచూసిండు. గుడ్లు తెరిసి "దిగురా గాడ్దీ" అన్నడు.

"మళ్ల ఇదేందిరో?" అనుకుంట ఓదెలు బండి దిగి జారిపొయే లాగును మీదికి గుంజుకోని మొల్దారం ఎక్కచ్చుకుంట నిలబడ్డడు. ఎనుకకు తిరిగి దూరమైపోయిన మీటింగు దిక్కు చూసిండు. మళ్ల పాటలినబడ్తానయి.

'నడుమనుంచె సెవులినబడ్తలెవ్వురా?' దొర బండి కదిలిచ్చిండు. ఓదెలుకు వశంగాని కోపమచ్చింది.

'లంజకొడుకు అదువారదాక కొంకులు తెగవురికిచ్చుకోని మీటింగు సూసె టాళ్లకు వచ్చిబడి ఎక్కచ్చుకున్నడు. మందిని దాటినంక దిగు దిగుమని తిట్టి దించిండంటె?' వానికి వాడే పశ్న వేసుకున్నడు. ఏదో అర్థమైనట్టు తల నిలువుగ ఊపుకుంట పొయే బండిదిక్కు చూసుకుంట నిలబడ్డడు.

పొద్దు పూర్తిగ కుంకింది. పడమటి దిక్కు ఎర్రిడాలు పరిసింది. 'బద్మాష్! [illegible]' తడుక పక్కనుంచి తల ఎనుకకు తిప్పి అరిసిండు

ప్రతాపరావు దొర. ఓదెలు సూటిగ దొరదిక్కు చూసిండు. చూసి ఎడమచేత్తో బిగించిన కుడి చెయ్యిపట్టి 'నాలొట్టగాడత్త' దన్నట్టు ఊపి ఎనుకమర్రి కాలులేపి వొడిశెల గుండుతీరుగ వురుకుడు బెట్టిండు. "దొంగ లంజకొడుకు యిదన్నమాట వాని సంగతి" కసిగ తిట్టుకుంట పాటలినబడే దిక్కు, రైతు కూలి సంఘం సభ దిక్కు, వేల జనం దిక్కు, తనోళ్ల దిక్కు వురుకుతాంటె ప్రతాపరావు దొర నోరెళ్ల బెట్టి చూస్తుండి పోయిండు.

కథనం

# శత్రు బాయొనెట్ కొసమీద

క్వులియాన్‌జియావో

అది 1936 ఆకురాలుకాలం. ఎర్రసైన్యం 25,000 'లీ'ల దూరం లాంగ్ మార్చ్‌లో పాల్గొన్న పిదప కూడా జపాన్ మూకలతో పోరాడడానికి తూర్పు చైనాలో అత్యధిక సంఖ్యలో సిద్ధమై ఉన్న రోజులు. ఫ్యూజియన్, జియాంగ్సీ ప్రాంతాల్లో విప్లవంలో భాగంగా ఎన్నెన్నో కార్యక్రమాలు జరిగాయి. అక్కడి ప్రజలు ఎప్పుడూ కొమింటాంగ్ బలగాలతో చుట్టుముట్టబడి దాడికి గురయ్యేవాళ్ళు నేను అప్పుడు ఫ్యూజియన్ ప్రాంతంలోని యువతీ యువకులతో పనిచేస్తున్న 20 సంవత్సరాల యువతిని. ఒక రోజు మేం జియిషా ప్రాంతంలో ప్రజలను పెద్దయెత్తున సమీకృతం చేస్తున్నప్పుడు, "కొత్త అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టే నిర్ణయం" కోసం పార్టీ కేంద్రానికి వెంటనే వెళ్ళాలని, ప్రాంతీయ కమాండర్, జిల్లా పార్టీ కార్యదర్శి అయిన హువాంగ్ లిగూయ్ నుండి సమాచారం అందింది.

ఒక గూఢచారి ఈ విషయాన్ని జియిషాలో ఉన్న శత్రురెజిమెంటల్ కేంద్రానికి చేరవేశాడు. మేం మధ్యాహ్నం భోజనం చేస్తున్నప్పుడు శత్రుమూకలు గ్రామాన్ని చుట్టుముట్టి మాపై దాడి జరిపాయి. మేం గట్టిగానే ప్రతిఘటించాం, అయినా దళ కమాండర్, గెరిల్లా సైన్య నాయకుడు, మార్గదర్శిలతో సహా 12 మందిమి పట్టుబడిపోయాం. నా కుడిచేయి, కుడికాలు దెబ్బతినడంతో నేను స్పృహతప్పాను. చేలేసరికి శత్రు ప్రధాన కార్యాలయంలో ఉన్నాను తరువాత నన్ను జియిషా పట్టణంలోని చిన్న దుకాణంలో ఉంచారు. ఆ యజమానురాలు మెత్తని హృదయంగలది. ఆమె నాకు

ఒక పాత్రలో తిండి పెట్టింది. కొమింటాంగ్ సేనల ఆధిపత్యంలో ఉన్న ప్రాంతాల్లోని సాధారణ ప్రజలంతా కమ్యూనిస్టు పార్టీపై అభిమానం కలవారే.

ఆ తర్వాతంతా నేను మా సంస్థ గురించి, కామ్రేడ్స్ గురించి ఏమీ చెప్పొద్దనే ఆలోచనతోనే ఉన్నాను. నేను కమ్యూనిస్టు యువజన సంస్థలో చేరేప్పుడు "ఎంతటి నిర్బంధంలోనైనా నేను సంస్థను, కామ్రేడ్లను కాపాడడానికి, నన్ను నేను త్యాగం చేసుకోడానికి సంశయించను. నేను విప్లవానికి నమ్మకద్రోహం చేయను" అని వాగ్దానం చేసాను. శత్రువును ఎదుర్కోడానికి, నన్ను ధైర్యపరచేవి ఎప్పుడూ గుర్తుండే ఆ మాటలే.

శత్రు రెజిమెంటల్ కమాండర్ మమ్మల్ని ఎన్నోసార్లు ప్రశ్నలతో వేధించాడు. ఎర్ర సైన్యం గురించి, పార్టీ గురించి మా నుండి సమాచారం రాబట్టడానికి ఎంతో ప్రయత్నం చేసారు మేము వాళ్ళకేమీ చెప్పలేదు. అందుకని ఇంక చేసేదిలేక మమ్మల్ని శత్రుదళాల ప్రధాన కేంద్రంలోని జైలుకు పంపారు. మమ్మల్ని వారాని కొకసారి విచారించేవారు.

మా సెల్‌లో మరిఇద్దరు పార్టీ సభ్యురాళ్ళు ఉన్నారు. మేం అక్కాచెల్లెళ్ళలా కలసి మెలసి ఉంటూ ఒకరొన్నొకరం ఉత్తేజపరచుకునే వాళ్ళం. మా భర్తలు కూడా ఎర్ర సైన్యంలో కలవాలనీ, భూస్వామ్య విధానం నశించాలని, దున్నేవానికే భూమి కావాలనీ.... తెలిపే పాటల్ని పాడేవాళ్ళం. మా ఎదురు సెల్‌లో ఉన్న మగ కామ్రేడ్స్ కూడా మా కార్యక్రమంలో పాలు పంచుకునే వాళ్ళు. మేం ఉన్నతమయిన వూయీ పర్వతాల మీద ఎర్ర జెండాలెగిరే సమయాన్ని ఊహించుకుంటుండే వాళ్ళం.

శత్రువు మా నుండి సమాచారం రాబట్టడానికి నిర్విరామంగా కృషిచేసి విఫలమయ్యాడు. తర్వాత 1937 మార్చిలో ఒక ఉదయం శత్రుదళ గుమాస్తా, ఇద్దరు సాయుధ సైనికులు మేం ఉపాహారం చేయబోయే ముందు మా వద్దకు వచ్చారు.

కాపలాదార్లు తలుపులు తెరచి మాకు దారిచ్చారు. దళకమాండర్ లిఫుషాన్, గెరిల్లా నాయకుడు వాంగ్ యులియాంగ్, బాకాఊదే మా, నేను, ఇంకొకరు- మొత్తం ఐదుగుర్ని బయటకు పిలిచారు. మమ్మల్ని శత్రుదళ ప్రధానకేంద్రంకు తీసికెళ్లి

ఉంచారు. సాయుధసైనికులు గదిలోపలికి, బయటికి చాలాహడావుడిగా తిరగటం చూస్తూంచున్నాం.

"ఇదంతా చూస్తుంటే పెద్దయెత్తున ఇంటరాగేషన్ చేసేలాగుంది" అని మా అనుమానించాడు

ఎవరోమాకు ఒకబకెటునిండా మాంసాన్ని, సగంబకెట్ రసాన్ని తెచ్చిపెట్టారు అవిచూచి మా ఎంతో ఉత్సాహంగా "నాకు రెండుకప్పులుచాలు అంతకంటే ఎక్కువ ఈరోజు తినోక్కలేను" అన్నాడు

"కామేడ్స్, కడుపునిండాతినండి మనం కలిసిపుట్టలేదు కానీ కలిసే మరణించ బోతున్నాం మనం నిజమైన సాయుధకామేడ్లం కాదా?" అన్నాన్నేను

మా దళకమాండర్ ముఖ్యంగా చాలా వాస్తవికదృష్టి కలవాడు ఆయన చిన్నగా "మనం పార్టీలో చేరేప్పుడు వాగ్దానం చేసాం మనం మన విప్లవకారులను గుర్తు తెచ్చుకుంటూ, పార్టీకి నమ్మకద్రోహం చేయకుండా ఉండాలి ఒకవేళమనలో ఎవరన్నా తప్పుకోదలిస్తే మనపోరాట వివరాల్ని పార్టీకి అప్పగించాలి ఇంక నా విషయానికొస్తే మాఅమ్మకిప్పుడు 50 సంవత్సరాలు పార్టీ ఆమెను చూసుకుంటుందనే నేననుకుంటున్నా కానీ అలా వీలుకాకపోయినా నేనేమీ అనుకోను" అన్నాడు మేమంతా ఎంతో శ్రద్ధగా ఆమాటల్ని విన్నాం

ఫలహారం తరువాత బ్రిగేడ్ కమాండర్వచ్చి ఒక పొడుగుబల్లముందు కూర్చు న్నాడు మాపేర్లను పిలిచిన తర్వాత మాపేర్ల జాబితామీద ఎర్రగుర్తుపెట్టాడు తరువాత బాకాపూది కాల్పుల దళాన్ని పిలిపించారు వాళ్ళు మాచేతుల్ని వెనక్కి కట్టేసి శిక్షిం చాల్సిన చోటుకి తీసికెళ్ళారు

దారిలోమేం చైనా కమ్యూనిస్టుపార్టీ వర్ధిల్లాలి, ఎర్రసైన్యం వర్ధిల్లాలని, కొమింటాంగ్ రివిజనిష్టులు నశించాలని నినాదాలిచ్చాం. వాళ్ళమమ్మల్ని ఆపడానికోసం మా నోళ్ళలో మురికిగుడ్డలు కుక్కారు. ఒకలోయలోగల రాళ్ళగుట్టవద్దకు తీసికె ళ్లారు.

"మీదళనాయకులు ఎక్కడున్నారు? మీరహస్యపార్టీ నిర్మాణం ఏప్రాంతాల్లో ఉంది? 5 నిమిషాలు వ్యవధినిస్తున్నాం. ఎవరైనాచెప్తే వొదిలేస్తాం" అని ఒక డరిచాడు.

చాలానిమిషాలు గడిచాయి. ఎవరినుండీ సమాధానంలేదు. తుపాకులు గురి పెట్టబడ్డాయి.... పేలాయి. మా బెటాలియన్ కమాండర్ 27 సంవత్సరాల యువకుడు లీఫుషాన్ నేలకొరిగాడు. మిగిలినవాళ్లం అలాగే నిలబడ్డాం.

"నేనుమీకు మరో 5నిమిషాలు వ్యవధినిస్తున్నా" వాడు మళ్ళీ అరిచాడు. మేం వెంట్రుకమందంకూడా కదల్లేదు. శత్రువు మా నుండి ఏమీ రాబట్టలేక పోయాడు మమ్మల్ని మళ్ళీవెనక్కి శత్రుప్రధానకేంద్రానికి తీసెక్కెళ్ళారు.

ఆ తర్వాత, జైల్లో నేనింక స్తబ్దంగా ఉండలేకపోయాను. రాళ్ళగుట్టవద్ద జరిగిన సంఘటనే నామదిలో మెదులుతోంది. బెటాలియన్ కమాండర్ మరణం వీరో చితమైనది. మాపార్టీ ఒకమంచి సభ్యుణ్ని కోల్పోయింది.

నాకళ్ళముందే ఎంతమంది కామ్రేడ్స్ సాయుధంగా మరణించలేదూ. నాకు మా నాన్న గుర్తొచ్చాడు. ఆయన వూయో పర్వతాల దిగువన వున్నచాంగాన్ ప్రాంతంలో ప్రశాంతమైన, బీదజీవితం గడిపాడు. అక్కడి నిరంకుశ ప్రభువులు, భూస్వాములు ఆయన్ని క్రూరంగా దోచుకున్నారు. ఎదురుతిరగడానికి ఆయనకెవరూ లేకపోయారు. తర్వాత 1929లో విప్లవంలోచేరి ప్యూటియన్ ప్రాంత నాయకుడయ్యాడు. ఆ 1929 శీతాకాలంలోనే కమ్యూనిస్టుపార్టీ చాంగన్, దానిచుట్టుపక్ల ప్రాంతాలకు వ్యాపించింది. నేను నా తండ్రిబాటలో నడచి విప్లవంలో భాగం పంచుకోవాలనుకున్నాను. అప్పుడు నాకు 13 ఏళ్లు. చెట్లెక్కి వంటచెరుకును సేకరించేదాన్ని. త్వరలోనే అక్కడి బాలదళానికి నాయకురాల్నయ్యాను. కమ్యూనిస్టు ముఖ్యంగా ప్రజలకోసమే పని చేయాలని, అసమానతల లేని నూతన వ్యవస్థ స్థాపనే లక్ష్యంగా పెట్టుకోవాలని పార్టీచెప్పినట్టు నడుచుకోమాని, ఆపదలలో గట్టిగా నిలబడడం నేర్చుకొమ్మని నాన్న చెప్పాడు. నేను గొప్ప విప్లవకార్యకర్తని కావాలని కోరుకున్నాడు. నాన్న ఒక కార్యక్రమంలో పాల్గొంటు మరణించాడు. మా అమ్మ, అన్న, వదిన కూడా విప్లవంలో భాగంగానే మరణించారు. ప్రస్తుతం నేనూ ఈ దారుణమైన

శత్రుకోరల్లో ఉన్నాను. ఏమైతేనేం, నేను జీవించి ఉన్నంత వరకు శత్రువుతో పోరాడుతాను.

ఆరోజుల్లో చైనా విప్లవం క్లిష్టపరిస్థితుల్లో ఉండేది తూర్పుచైనాలో జపాన్ నియంతలు కొత్త పద్ధతుల్లో దాడిచేయడం మొదలు పెట్టారు. అదే సమయంలో కొమింటాంగ్ రివిజనిస్టులు ఒకదానివెంబడి ఒకటిదాడులు చేస్తు ప్రజలు విప్లవశక్తిగణ చడం మీదనే వాళ్ళ ఆలోచనల్ను కేంద్రీకృతం చేసారు మా స్థావర ప్రాంతాలు శత్రుబలం కింద కుదించుకుపోయాయి. మొత్తానికి మేం చాలా క్లిష్టపరిస్థితుల్లో చిక్కు కున్నాం కొన్నిసార్లు నెలచివర్లలో మాకు తినాడానికి ఏమి దొరికేది కాదు అయినా మేం తొణకలేదు ఎర్రసైనికుడు ఉక్కుకన్నా గట్టిగా నిలబడాలి కదూ.

జూలైలో మా ప్రాంతీయ కమాండర్ హువాంగ్ లిగూయ్ ఒక యుద్ధంలో తనకాలు పోగొట్టుకున్నాడు తర్వాత ఒక కందకంలో పడిపోయి శత్రువుచే చంప బడ్డాడు అయన ధైర్యంలో, సైనిక పట్టుదలలో ప్రముఖమైన పేరు గలవాడు. అంతెందుకు, శత్రువు భయంతో వణకడానికి ఆయన పేరుమాత్రం చాలు. ఆయన మరణవార్తను ఎర్రసైన్యం చాలా ప్రాంతాల్లో ప్రకటించింది తాము కందకంలో చంపినదెవరో శత్రువు గుర్తించలేకుండా ఉన్నప్పుడు వార్త శత్రువును సందిగ్ధావస్థలో పెట్టింది.

ఒక సాయంత్రం మా నుండి నిజం రాబట్టడానికి నన్ను, ఎర్రసైన్య ఆహార అధిపతిని చాలాసేపు ప్రశ్నలతో వేధించారు. వాళ్ళ ప్రాంతీయ కమాండర్, సైనిక న్యాయస్థానాధిపతి, బ్రిగేడ్ కమాండర్, వాళ్ళ సభ్యులు మా ముందుకూచున్నారు. గది లో రెండువైపులా కత్తులు, ఆయుధాలు ఉన్నాయి మొదలు మా మెస్ ఆఫీసర్ని ప్రశ్నలడిగారు. ఆయన నుండిఒకే ఒక్క సమాధానం వచ్చింది– "నాకుతెల్వదు" అయన్ని బాగాకొట్టి గది అవతలకి తీస్కెళ్ళారు.

తరువాత రోజు నా వద్దకొచ్చారు. నేను నిశ్శబ్దంగా గదిలోకి నడిచాను. అక్కడ ఒక అద్దంపెట్టెలో హువాంగ్‌లిగూయ్ తల పెట్టబడి ఉంది. అది చూడగానే నా మనసు అదుపు తప్పింది క్షణకాలం గుండె ఆగిపోయింది కుదుటపడడానికి శక్తినంతా కూడ దీసుకున్నాను. నా భావాలను అణచి ట్టాను.

"నీపేరేంటి? నువ్వు ఎర్రబందిపోట్లలో ఎందుకుచేరావ్?"
బందిపోటు అనేపదం నన్ను రెచ్చగొట్టింది. "చైనాకమ్యూనిస్టు పార్టీ పేదలకొరకు పని చేస్తుంది. మీరే బందిపోట్లు ఎక్కడికి పోయినా అంతా కొల్లగొడ్తారు. కాలుస్తారు, చంపుతారు, చెరుస్తారు.

"ఆమెకు జీవిత ఖైదు వేయండి" మెజిస్ట్రేట్ అరిచాడు. అప్పుడు వాళ్ళ ప్రాంతీయ కమాండర్ లోనికి వచ్చాడు "వద్దు అలాచేయకండి ఆమెను మొదలు ఈ తల చూడనీయండి"

"నాకెట్లా తెలుస్తుంది?, ఇది ఎవరిదనేది? ఆమొహం మీద పేరు రాసుందా?" వాళ్లు హువాంగ్ తుపాకిని చూపించారు. నేనన్నాను శాంతంగా- "మీకు తుపాకులు కూడా ఉన్నాయా? హువాంగ్ తుపాకి ఒకప్పుడుమీది. నేనెట్లా చెప్పగలను ఏది ఎవది...."

నామాట పూర్తికాకముందే ఓ సైనికుడు నా మొహం మీద కొట్టాడు. నానోటి నుండి ముక్కునుండి రక్తం కారింది. నేను తలయెత్తి "నన్నుకొట్టి లాభం లేద"ని వారించాను.

నేను బలప్రయోగానికి లొంగనని తెలిసాక ప్రాంతీయ కమాండర్ మెత్తటి యుక్తులతో ముందుకొచ్చాడు. అతను ఒక కొమింటాంగ్ ఆఫీసరు భార్యను పిలిచాడు ఆమె వికృతాలంకరణ చూస్తే నాకు చీదరపుట్టింది. అప్పుడు ఆమెను దగ్గరనుండి చూసాను ఆమె వాంగ్ ఒకప్పుడు విప్లవంలో పనిచేసిపట్టుబడి తన కామ్రేడ్స్‌కి నమ్మకద్రోహం చేసింది. ఆమె నా క్రోధపూరిత దృక్కులకు తట్టుకోలేక తల వాల్చేసింది.

"ఆమెనేమైనా అడుగు"అని కొమింటాంగ్ ఆఫీసర్ ఒకాయన ఆజ్ఞాపించడంతో "నువ్వు హాయిగానే ఉన్నావుకదూ" అంది

నవ్వాను "సిగ్గుచేటు" ఆమె తత్తరపడి వెనుదిరిగి వెళ్లిపోయింది. విచారణ ఆ రాత్రంతా కొనసాగింది. చివరకు దళకమాండర్, ప్రాంతీయకమాండర్‌తో

"నేను నీకుచాలా చెప్పాను. ఆ మెదడులో విషంచాలా లోతుగా దిగింది ఆమె చావాల్సిందే" అన్నాడు

"ఆమెను నాన్జియాంగ్ ప్రధాన న్యాయస్థానానికి పంపడం మంచిది. వాళ్ళైతే ఈ ఉక్కును కరిగిస్తారు'' అన్నాడు ప్రాంతీయకమాండర్

నేను నా సహచరులను కలవబోతున్నాను. షులినోట్లోకి వెళ్ళబోతున్నాను అని అనుకున్నాను. చాలా విచారమేసింది. ఒక ఇద్దరు నాదగ్గరికివచ్చారు. "వినండి, మేము చావుకుభయపడం అక్కడికి తీస్కెళ్ళినా తేడా ఏమీరాదు. ఆ విషయాన్ని మరచిపోండి" అన్నాను

విప్లవగీతాలు పాడుకున్నాక కొద్దిగా నయమనిపించింది. 2, 3 రోజుల తర్వాత మెస్ ఆఫీసర్ను, నన్ను జైలువ్యాన్‌లో ఎక్కించి తీస్కెళ్ళారు. పొంచివున్న గెరిల్లా దళాలు ఎదుర్కోవడంవల్ల మేం వెనుదిరగాల్సొచ్చింది. రెండుసార్లు ప్రయత్నించి విఫలమయ్యారు

ఆ సమయంలోనే జపాన్ నియంతలు చైనాలో అడుగుపెట్టారు దాంతో జపాన్ వ్యతిరేక ఐక్యసంఘటన ఏర్పడింది. దేశవ్యాప్తంగా ప్రతిఘటనా పోరాటాలు అరంభమయ్యాయి. జైల్లోఉన్న పార్టీకమిటీ నాయకత్వంలో జైల్లోవసతులు మెరుగవ్వాలని నిరాహారదీక్ష చేపట్టాం. బయటకూడా ఎర్రసైన్యం గెరిల్లానాయకులు దేశరక్షణకై జరుగుతున్న సి పి సి 10 సూత్రాల జపాన్ వ్యతిరేక కార్యక్రమాల్లో భాగంగా రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని ప్రదర్శనలు జరిపారు చివరకు 1937లో మేం విడుదలయ్యాం

తీర్పు:

# సాహిత్యంపై సరికొత్తదాడి

మొన్నటి అగస్ట్ 28వ తేదిన విజయవాడలోని రెండవ అడిషనల్ జిల్లా మున్సిఫ్‌కోర్టు ఇచ్చిన ఒక తీర్పులో మెజిస్ట్రేట్ గారు రచయిత్రి రంగనాయకమ్మ గారికి శిక్ష విధించారు. 'తులసిదళం కాదు గంజాయిదమ్ము' అనే పేరుతో ఆంధ్రపత్రిక ఆదివారం సంచికలలో యండమూరి వీరేంద్రనాథ్ నవలపై ఆవిడ రాసిన విమర్శనాత్మక వ్యాసం ఈ కేసులో వివాదాస్పదమయింది. ఆ వ్యాసంలో ఆ నవలనే కాక ఆ నవలకు ముందుమాటగా రచయిత డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు రాసిన భావాలని కూడా ఆవిడ విమర్శించారు. మూఢ నమ్మకాలని సమర్థిస్తూ విజ్ఞాన శాస్త్రాన్ని వైద్య శాస్త్రాన్ని అపహాస్యం చేసిన ఈ నవలను ఒక డాక్టర్ ప్రశంసిస్తు రాయడాన్ని ఆవిడ అభిశంసించారు. 1981 డిసెంబర్ ఆరవ తేదీ నుంచి, 1982 జనవరి పద మూడవ తేదీ దాకా ఏడు వారాల పాటు సాగిన ఈ వ్యాసంలో డిసెంబర్ 27 సంచికలోను, జనవరి 3వ తేదీ సంచికలోనూ ముందుమాట పై విమర్శ వచ్చింది. మూడురోజులు గడచిన వెంటనే_ ఇంకా వ్యాసం పూర్తికాకుండనే జనవరి ఆరవ తేదీన కొమ్మూరి వేణుగోపాలరావు రంగనాయకమ్మగారికి లీగల్ నోటీసిచ్చారు. దానికి వెంటనే ఆవిడ జవాబు ఇచ్చారు•

మరో నెల రోజులలో రంగనాయకమ్మ గారి మీద ఒక సివిల్, ఒక క్రిమినల్ కేసుతో సహా పరువునష్టం కేసు దాఖలా అయింది. 'ఆంధ్రప్రభ' వాళ్ళు క్షమాపణ చెప్పుకొని కేసు నుండి తప్పుకొన్నారు. కొమ్మూరి తరపున సాక్ష్యులుగా 'ఆంధ్రజ్యోతి' వార పత్రిక సంపాదకులు పురాణం సుబ్రమణ్యశర్మ, రచయిత్రి లత కూడా వచ్చారు కేసు సుమారు రెండున్నర సంవత్సరాలు సాగింది కొమ్మూరి ఇరవయివేల రూపాయలుగా అంచనావేసిన ఈ పరువునషం కేసులోనే కోర్టువారు రంగనాయకమ్మ గారికి వెయ్యిరూపాయల జరిమానా (లేదా మూడు నెలల సాధారణ ఖైదు) విధించారు.

సృజనాత్మక సాహిత్యం మీదా సాహిత్య అభివృద్ధికి అవసరం అయిన సాహిత్య విమర్శ మీదా దాడులు తెలుగు సాహిత్యానికి కొత్తగాదు, మాలపల్లి నుండి 'మరీచిక' దాకా ఎన్నోసార్లు సాహిత్యం నిషేధానికి గురి అయింది. విప్లవ సాహిత్యం

---

• ఈ సంచికలోనే ఆ జవాబు పూర్తి పాఠాన్ని చూడండి.

నిషేధాన్నే గాక, రచయితలపై నిర్బంధాన్ని కూడా చవిచూసింది ప్రభుత్వ నిర్బంధా లేగాక గతమూడు దశాబ్దాలుగా తెలుగు సాహిత్యంలో ప్రేరేపించిన పెట్టుబడి కూడా సాహిత్యంమీద దాడి చేస్తోంది, రచనలో ఉన్న సృజనాత్మకతను పక్కనబెట్టితాము పెట్టిన పెట్టుబడి ప్రయోజనాలకు పనికొస్తుందా రాదా అన్న ఏకైక ప్రమాణం మీదే ప్రచురణార్హతను నిర్ణయించే వ్యాపార పత్రికలు సాహిత్యాన్ని నిర్దేశిస్తున్నాయి। ఈ కేసులోనే సాక్ష్యం చెప్తు ఆంధ్రజ్యోతి వారపత్రిక సంపాదకులు రాజకీయ కారణాల వల్లే జానకివిముక్తి సీరియల్ నవల ప్రచురణని నిలుపు చేసామని చెప్పుకున్నారు. (ఆ పత్రిక యజమాని అధికార పార్టీ పార్లమెంటు సభ్యుడనుకొండి, అయితే ఆయనకు అధికార పార్టీ రాజకీయలే గాక జీతపు రాళ్ళతో రచయితలను కొనుక్కోనేందుకు ఆస్తికూడా వుంది) ఈ వ్యాపారస్తులు మంత్రులు, పోలీసు వాళ్ళేకాక ఇప్పుడున్యాయ స్థానాలు కూడా సాహిత్యం మీద తీర్పుని ప్రకటిస్తున్నాయి.

స్వేచ్ఛగా సాహిత్యాన్ని విమర్శించే అవకాశాన్ని అరికట్టడం ప్రజల భావ ప్రకటన స్వాతంత్ర్యం పై దాడి చేయడమే. నిజానికి ఇది రాజ్యాంగ విరుద్ధం కూడా. ఆ సంగతి పై కోర్టులు తేలుస్తాయిగాని ఈ తీర్పు దారితీస్తున్న ప్రమాద భరిత పరిణామాలను మాత్రం మొత్తంసాహితీ ప్రపంచమంతా ప్రతిఘటించాలి, విమర్శకు తావు లేని చోట సాహిత్యానికి మనుగడలేదు, అధికారం చేతిలో ఉన్నవాళ్ళు పుస్తకాన్ని నిషేధిస్తారు. పెట్టుబడి చేతిలో ఉన్నవాళ్ళు ప్రచురణను నిలుపుచేస్తారు. ఇహ ఇప్పుడు డబ్బులా, పలుకుబడి ఉంటే విమర్శని నిరోధించవచ్చు అందుకే ఇది ప్రజాస్వామిక విలువలను తాకట్టుపెట్టి సాహిత్యవ్యాపారం చేసే రచయితల పరువు ప్రతిష్ఠల విషయం ఇంకెంత మాత్రమూ కాదు ఇది విమర్శను సహించలేని రచయిత సాహిత్య ప్రగతికి కలిగిస్తున్న అవరోధం. ఈ తీర్పు సాహిత్యం పై సరికొత్తదాడి.

—సురా

## రంగనాయకమ్మ జవాబు

6-1-1982 తేదీనాటి మీ రిజిష్టర్డ్ లెటర్ అందింది. కొమ్మూరి వేణుగోపాలరావు గారి తరఫున మీరు వ్రాసిన విషయాలు చూశాను. మీ క్లయింట్‌కి నేను పరువు నష్టం కలిగించాననీ. అందుచేత నేను ఆయనకి క్షమాపణ చెప్పుకోవాలనీ, లేకపోతే ఆయన నా మీద కేసు పెడతారనీ రాశారు మీరు.

మీ ఆరోపణకి నా జవాబేమిటంటే– ఆయనికి నిజంగా పరువునష్టం కలిగివుంటే ఆ పని జరిగింది నావల్ల కాదు, ఆయన ప్రవర్తన వల్లే ఆయనకు పరువు నష్టం కలిగింది.

నేను ఆయనకు క్షమాపణ చెప్పుకోవడం కాదు, ఆయనే తెలుగు పాఠకలోకానికి క్షమాపణ చెప్పుకోవాలి.

మీ క్లయింటు, పదహారేళ్ళ వైద్యానుభవం గల డాక్టరుగా, మరెన్నో ఏళ్ళ రచనానుభవంగల రచయితగా కీర్తిమంతుడని రాశారు మీరు. అందుకే, అంత అనుభవం గల డాక్టరుగా, అంత అనుభవంగల రచయితగా ఆయన చేసిన పని మరింత పెద్దతప్పు అవుతుంది.

" తులసి దళం " నవల పాఠకలోకానికి ఘోరమైన హాని కలిగించే పుస్తకం ఒక చిన్న పిల్లకు చేతబడి ప్రయోగం వల్లనే జబ్బు చేసినట్లుగా రాసి, ఆ ప్రయోగం చివరిలో ఆగిపోవడం వల్లనే ఆ పిల్లకి జబ్బు మళ్ళినట్లు కథావస్తువు తయారుచేసి, ఆ పుస్తక రచయిత చేతబడి మూఢనమ్మకాన్ని ప్రజలలో మరింత వ్యాపింప చేయడానికి ప్రయత్నించాడు. ఆపిల్లకు జబ్బు సహజమైన అనారోగ్యం వల్ల వచ్చింది కాదనటానికి రుజువుగా ఆ జబ్బు లక్షణాలు వైద్యశాస్త్రంలోని ఏ పరీక్షలకి అందలేదని రచయిత ప్రతిసారీ నొక్కి చెప్తూ వుంటాడు. ఆ పుస్తకంనిండా క్షుద్రదేవతల్నీ, క్షుద్రమంత్రతంత్రాల్నీ, క్షుద్ర కార్యకలాపాల్నీ, హింసనీ, నేరప్రవృత్తినీ జుగుప్సాకరమైన మూఢనమ్మకాల్నీ, అడుగడుగునా ప్రోత్సహించాడు. వైద్య శాస్త్రాన్ని నవ్వులపాలు చేశాడు, సమాజంలో అభివృద్ధి చెందిన శాస్త్రజ్ఞానాన్ని, తర్కజ్ఞానాన్ని కించిత్తయినా వుపయోగించుకోకుండా, వాటిని హీనపరుస్తూ, వెటకారాలు చేస్తూ, మూఢనమ్మకాల్నే బలపర్చాడు. ఈ పుస్తకం చది

విన ప్రభావం వల్ల కొందరు యువతీ యువకులు తప్పుదారి పట్టారు. ఒక యువకుడు పిచ్చివాడయ్యాడని ఒక దినపత్రిక ప్రచురించింది (21-11-1981 తేది ఆంధ్ర ప్రభ దిన పత్రికలో యండమూరి వీరేంద్రనాథ్ రచించిన తులసిదళం నవలప్రభావం వల్ల శ్రీ పి శ్రీనివాసరావు అనే యువకుడు పిచ్చివాడయ్యాడు అనే వార్త చూడండి) ఈనవలలో ఉరిద్వారా ఆత్మహత్య ఎలాచేసుకోవాలో వర్ణించిన తీరువల్లబెజవాడలో జ్యోతిఅనేయువతి అదేపద్ధతిలో ఆత్మహత్య చేసుకుంది ఇటువంటి చెడు ప్రభావాలను కలిగించగల నీచమైన ధోరిణి ఈ పుస్తకంలో వుందని సరైన సామాజిక స్పృహ కలిగిన వాళ్ళు తేలిగ్గా గ్రహించవచ్చును. ఇంత హానికరమైన పుస్తకానికి "ముందు మాట" రాసే పనికిపూనుకున్న మీక్లయింటు డాక్టరై వుండి, రచయితై వుండి. ఎటువంటి పనిచేసిందీ అందరికి తెలుసు మీక్లయింటుకి అముందుమాట రాయమన్న రచయితే కనపడ్డాడుగానీ. దాన్నిచదివే పాఠకలోకం కనపడలేదు పేరువింటేనే బాగారాస్తాడనే అభిప్రాయం వెలిబుచ్చడంతో ప్రారంభించి తన డాక్టర్ అనుభవాన్ని రచయిత అనుభవాన్ని సంపూర్ణంగా విస్మరించి, ఒక క్షుద్రరచయితని నిర్విమర్శగా ఆదేవాణిలో జైత్రయాత్రలు చేసుకుంటూ బొమ్మని భుజంతట్టిన క్షణంలోనే మీ క్లయింటు సాహిత్య ప్రపంచంలో నేరస్తుడయ్యాడు. పాఠకలోకంపట్ల ఎంతో బాధ్యతా రహితంగా నిజాయితీ హీనంగా ప్రవర్తించి ఆపుస్తకంద్వారా పాఠకులకు జరిగేహానికి తనూ కారకుడయ్యాడు.

సాహిత్య ప్రపంచానికి సంబంధించిన ఏవ్యక్తికైనా, ఏఒక్క పాఠకుడికైనా మీక్లయింట్‌మీద నేరారోపణచేసి, "ఇంతహానికరమైన పనిచేశావేమిట"ని అడిగే హక్కు ఉంటుంది. ఒక పాఠకురాలిగా నాహక్కు నేను వినియోగించుకున్నాను. ఆయన్ని "హరిదాసు" అన్నా, "భజనచేశాడు" అన్నా, నావ్యాసంలోవున్న ఇంకేమాట అన్నా అది ఆయనచేసినపని స్వభావాన్ని వివరించటమే. పాఠకుల క్షేమాన్ని ఆలోచించి, ఆ పుస్తకంలోను, ఆముందుమాటలోనూ హానికలిగించే విషయాల్ని వారికి అర్థమయ్యేటట్లుచెప్పి, వారిని రక్షించడంకోసం నేనీపనిచేశాను. పుస్తక రచయితని విమర్శించడంతోపాటు, ముందుమాట రాసిన మీక్లయింటునికూడా విమర్శించాను. ఆ పుస్తకాన్ని పబ్లిష్‌చేసిన పబ్లిషర్‌నికూడా విమర్శించాను. అలాగే ఈఒక్క పుస్తకాన్నే కాక పాఠకులకు హానిచేసే కొన్ని యితరపుస్తకాల్నికూడా విమర్శించాను. ఇదంతా నేను పాఠకులక్షేమం ఆలోచించి, వారికి మేలు చెయ్యడంకోసం చేశానుగాని, మీ

క్లయింట్ మీదో, మరొకరి మీదో వ్యక్తిగత శత్రుత్వంతోనో, దురుద్దేశంతోనో చెయ్య లేదు. నాస్వార్థంకోసం చేసుకోలేదు.

మీక్లయింటు అరకంగా హానికరమైన "ముందుమాట" రాయకుండా వుంటే ఈ రకమైన విమర్శకు గురికాకుండా వుండేవాడు. విమర్శని ఎదుర్కొనే మార్గం దానికి ఎదురు విమర్శచేసి దాంట్లో తప్పులుంటే వాటిని రుజువు చెయ్యడమే.

మీక్లయింట్ పరువుకి నావిమర్శ ఎలా హానికలిగించిందో, నేను నావిమర్శలో ఎక్కడ అసత్యాలురాశానో, మీక్లయింట్ రాయనిమాటల్ని చెయ్యనిపనుల్ని నేనెక్కడ ఆరోపించానో, నాఆర్గ్యుమెంటు ఎందుచేత అవమానకరంగా వుందో ఇవన్నీ రుజువు చేస్తూ ఆయన తన జవాబు ఒకటి పాఠకలోకంముందు పెట్టవచ్చు, నాకు అవకాశం ఇచ్చిన వేదికే ఆయనకూ అవకాశం ఇస్తుంది. ఆయన జవాబు ఏ మాత్రం సమంజసం గా వున్నా నేను వెంటనే పాఠకులముందు పత్రికాముఖంగా క్షమాపణ చెప్పుకుంటాను. మీ క్లయింట్ నానించి 20 వేలు నష్టపరిహారం వసూలు చేస్తారని రాశారు మీరు. జీవితంలో ప్రతి అంశాన్ని డబ్బుతో విలువకట్టి చూసుకోవలిస్తే పరువుకీ, కీర్తికీ, కూడా ధరలు వున్నట్లు కనపడతాయి. తన పరువుకి కొంత ధర కట్టుకున్న మీ క్లయింటు, తను చేసిన అప్రతిష్టాకరమైన పనికి కూడా డబ్బుతో తూచి విలువ కట్టు కుంటే అది ఎన్నోరెట్లుమైనస్‌లో వుంటుంది. ఆ అప్రతిష్టలోంచి ఈ పరువుని తీసే స్తే ఇంకా బోలెడు అప్రతిష్ట మిగుల తుంది. ప్రతిష్టపోయి, అప్రతిష్ట మిగిలే పని ఆయనే చేసుకున్నాడు గనుక, ప్రతిష్టని మళ్ళీరక్షించుకునే పని కూడా ఆయనే చేసు కోవాలి అత్మ విమర్శ తప్ప, దాన్ని రక్షించుకునే మార్గం ఇంకోటి లేదు.

తను చేసిన తప్పేమిటో నిజంగా గ్రహించుకుని, పశ్చాత్తాపపడి, పాఠకలోకా నికి క్షమాపణ చెప్పుకోవడం మొదటి పద్ధతి.

తప్పు గ్రహించుకుని, మౌనమే అంగీకారంగా, విమర్శతో వదిలి పూరు కోవడం రెండో పద్ధతి.

సాహిత్యలోకాన్ని వదిలిపెట్టి విమర్శకుల్ని కోర్టుకి లాగడం చివరి పద్ధతి. ఈ ప్రత్యేక సందర్భంలో ఈచివరి పద్ధతి చెడ్డదీ మొదటి పద్ధతి గొప్పదీనూ. తప్పు దిద్దుకున్న మనిషి ఆ క్షణం నించీ తప్పు చెయ్యని మనిషితో సమానం అవుతాడు

మీక్లయింటు తప్పు దిద్దుకుని చూపించి తన పరువుని తనే నిలబెట్టుకోవాలి గానీ, విమర్శ చేసిన వ్యక్తి మీద కోర్టులో కేసు పెట్టి 20 వేలు వసూలు చేసి పరువు నిలబెట్టుకోలేడు.

హైదరాబాదు
12-1-1982

(సం॥) రంగనాయకమ్మ

సమీక్షలు :

# Inside the Family
# " కుటుంబం లోపల... "

ఓల్గా

రాజులూ, రాజ్యాలూ, రాజ్యాంగాలూ అన్నీ మారాయి. మారుతున్నాయి. కానీ యేనాడో మనువు స్త్రీల కోసం రాసిన ధర్మసూత్రాలు మాత్రం మారకుండా వుంటున్నాయి. స్త్రీ చిన్నతనంలో తండ్రి రక్షణలో, యవ్వనంలో భర్త రక్షణలో, వృద్ధాప్యంలో కుమారుడి రక్షణలో వుండాలి. అంటే స్త్రీకి కుటుంబమే ప్రపంచం, పౌరులను అంటే పురుషులను రాజులో, రాజ్యాంగాలో రక్షించుకుంటారు రాజ్యాంగం తో అప్పహక్కులతో స్త్రీలకేం సంబంధం లేదన్నమాట స్త్రీలు తమ కుటుంబ లోని పురుషుల చేత పరిపాలింప బడుతున్నారు ఈ రోజు స్త్రీల పరిస్థితి అలాగే వుంది.

సమాజంలో జరిగే అన్యాయాలకు బలైపోతున్న పీడిత ప్రజలు సంఘటిత పడుతున్నారు. పోరాడుతున్నారు హక్కులు సాధించుకుంటున్నారు.

కార్మికుల పోరాటాలకూ, కర్షకుల పోరాటాలకూ ఉద్యోగి, విద్యార్థుల పోరాటాలకూ అనేక సంఘాలేర్పడి చైతన్య వంతులైనవారి నాయకత్వాన పురోగమిస్తున్నాయి. పోరాడే హక్కు కోసం కూడా ఉద్యమించాల్సిన స్థితిలో వున్న ప్రజల కోసం పౌర హక్కుల సంఘాలు, ప్రజాతంత్ర హక్కుల సంఘాలు యేర్పడుతున్నాయి, ప్రజల కున్నహక్కుల్ని గురించి వివరించడానికీ వారిని జాగృతం చెయ్యటానికీ పౌరహక్కుల సంఘాలు పని చేస్తున్నాయి.

నువ్వు కార్మికుడివా? నీ హక్కుల కోసం మేమున్నాం మా సంఘం వుంది.
నువ్వు రైతుకూలీవా? నీ విముక్తి కోసం సంఘం వుంది నువ్వు ఎన్.జీ.ఓ. వా?
నువ్వు విద్యార్థివా? ఇదిగో సంఘం, ఉద్యమిస్తే మనదే విజయం

కానీ–

" నువ్వు కూతురివా! భార్యవా? తల్లివా? నీ హక్కులా?"

అదెలా కుదురుతుంది? అవన్నీ నీవ్యక్తిగత సమస్యలు అవన్నీ బైట చర్చకు రాకూడదు. నీ తండ్రి మనసు మార్చు, నీ భర్తని సంస్కరించు నీ కొడుకు మనసు

కరిగించు, అసలయినా ఎలాగోలా వాళ్ళు చెప్పినట్లు నడుచుకుంటే పోలా? రాజీ పడితే పోలా? హక్కుల కోసం పోరాటమంటూ కూచుంటే కుటుంబం విచ్ఛిన్నమై పోదూ? కుటుంబం కూలిపోతే కుటుంబ సంబంధాలు తెగిపోతే యింకేమన్నా వుందీ? ప్రభుత్వ పతనాలూ, విప్లవం, యుద్ధం ఏమైనా జరగొచ్చుగానీ కుటుంబం కూలిపోవటమా – అది జరగరానిది" – కుటుంబ వ్యవస్థలోపడి నలుగుతున్న స్త్రీల హక్కుల గురించి చాలా మంది చైతన్య పరులనుకునే వారి ఆలోచనలుకూడా యిలాగే వుంటున్నాయి.

కుటుంబంలో జరుగుతున్న భయంకరమైన అణచివేతను పట్టించుకునే వారే లేనిస్థితిలో, అతికొద్ది మహిళాసంఘాలు మాత్రమే పరిమితంగా స్త్రీల అణచివేతకు వ్యతిరేకంగా పనిచేస్తున్న స్థితిలో ఢిల్లీ పి. యు. డి. ఆర్ వాళ్ళు "కుటుంబం లోపల" అనే పేరుతో యింగ్లీషులో ప్రచురించిన చిన్న రిపోర్టు ఎంతో ఆశాజనకంగా వుంది. ప్రజాతంత్ర హక్కుల కోసం పోరాడే సంఘాలు కుటుంబంలో స్త్రీల అణచివేతను కూడా గమనించాయనీ దానికి వ్యతిరేకంగా కార్యక్రమాలు తీసుకోవటానికి సిద్ధంగా వున్నాయనీ ఈ రిపోర్టు తెలియజేస్తుంది. ఇది మహిళా వుద్యమానికి బలాన్ని యిస్తుంది.

కుటుంబంలో స్త్రీ ఎన్ని రకాలుగా అణిచి వేయబడుతోందో ఈ రిపోర్టులో సంగ్రహంగానే అయినా సమగ్రంగా వివరించారు.

ఆడ పిల్లల్ని పుట్టక ముందే గర్భంలోనే చంపేస్తున్నారు. గర్భంలో వుండగానే ఆడ పిల్లో మగపిల్లాడో తెలుసుకునే వైజ్ఞానిక ప్రగతి ఈపురుషాధిక్య ప్రపంచానికిలా వుపయోగపడుతోంది. పుట్టిన తర్వాత ఆ పిల్లను పట్టించుకోకా, నిర్లక్ష్యంగా చూసీ చంపుతున్నారు. బతికినా ఆమెను "గుండెల మీద కుంపటి"గా భావించి ఎలాగోలా వదిలించుకోటానికి తలిదండ్రులు ప్రయత్నిస్తే ఆ కుంపటి మీద యింత కిరసనాయిలు పోసి తగలెయ్యటానికి భర్తలు ప్రయత్నిస్తున్నారు. వరకట్నాల చావులు రోజురోజుకి పెరుగుతున్నాయి, కానీ ఆ కేసుల గురించి సరైన విచారణ జరగదు. పోలీసు యంత్రాంగం, న్యాయ స్థానాలు స్త్రీల విషయంలో యెంత నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నాయో ఉదాహరణలతో వివరించారు.

దేనిని వరకట్నం అంటారో న్యాయస్థానానికే తెలియని స్థితి వుంది. శశిబాల భర్త అత్తమామల్ని స్కూటర్ కొనిమ్మని వేధించాడు. వారు కొనివ్వలేక పోతే ఆమెని హింసించాడు ఆమె చనిపోయింది. ఈ కేసు కోర్టుకు వెళ్ళితే పెళ్ళి అయిన తర్వాత స్కూటర్ అడిగాడు గాబట్టి అది వరకట్న నిషేధ చట్టాన్ని ఉల్లంఘించినట్లు కాదని జడ్జి కేసు కొట్టేశాడు, బీహార్‌లోని జయనగర్‌కు చెందిన 25 యేళ్ళ కిరణ్ తండ్రిమాట వినలేదని తండ్రి ఆమెను నిర్బంధించబోతే అతనికి సాయంగా పోలీసులు యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్, యితర అధికారులు వచ్చారు. కుర్షీద్ జహాన్ అనే 26 యేళ్ళ స్కూలు టీచర్ని ఆమె అన్నలు బంధువులు కలిసి బలవంతంగా ఎత్తుకెళ్ళి యింట్లో నిర్బంధించారు ఆమె ఒక మహిళా సంఘంలో పని చెయ్యటం వారికిష్టం లేదు. పంజాబ్‌లో కైలాసవతి అనే టీచర్ కేసులో ఆమె యెక్కడ ఉద్యోగం చెయ్యాలో యెక్కడ వుండాలో నిర్ణయించే అధికారం ఆమె భర్త దేనని జడ్జి తీర్పు ఇచ్చాడు.

చట్టాలను పరిశీలిస్తే వివాహానికీ విడాకులకూ భరణానికీ, దత్తతకూ సంబంధించిన 17 న్యాయ సూత్రాలూ పురుషాధిపత్యాన్ని నిలబెట్టేవే. అసలు విడాకులు తీసుకునే స్థితికి రావటం, దాని కోసం పోరాడటం అంటే స్త్రీకి చాలా కష్టం ఆస్థితికి వచ్చిన స్త్రీకి చట్టం యేమీ సాయపడదు, ఆస్త్రీకి బిడ్డలుంటే మరీ కష్టం భర్తకు విడాకులు యిష్టమైతే పిల్లల్నీ భార్యనూ అతి తేలిగ్గా వదిలించుకోగలడు. అదే స్త్రీ విడాకులు కావాలని అడిగితే భర్తకు అది యిష్టం లేకపోతే పిల్లలను అడ్డంపెట్టుకుని ఆమెను బ్లాక్‌మెయిల్ చేస్తాడు. ఆ అవకాశం చట్టం అతనికి యిచ్చింది పిల్లలు తల్లి దగ్గర వుండటమే మంచిదని తెలిసినా చట్టం వారిని తండ్రికి అప్పగిస్తుంది పిల్లలకు దూరంగా బతకటం తల్లికి యెంత అసాధ్యమో పురుషులకూ చట్టానికీ కూడా బాగా తెలుసు. స్వంత ఆస్తి మీద ఆధారపడి వున్న ఈ సమాజంలో స్త్రీలకు ఆస్తిహక్కు లేదు.

స్త్రీల అభివృద్ధి కంటూ ప్రభుత్వం వేసే పథకాల వల్ల స్త్రీలకు జరిగే మేలు యేమీ వుండటం లేదు. కుట్లూ అల్లికలు, నేతపనీ మొదలైనవి నేర్చుకున్న స్త్రీలకు ఆధునిక పరిశ్రమలలో ఏం అవకాశాలు దొరుకుతాయి? ఆధునిక సాంకేతిక శిక్షణను పొందే అవకాశం స్త్రీలకు అతితక్కువగా వుంది స్త్రీల సహాయానికంటూ ప్రభుత్వం చేసే పనులు స్త్రీలు సంప్రదాయాల సంకెళ్ళలో వుండటానికే సహాయపడుతున్నాయి వాళ్ళను పరాధీనలుగానే వుంచుతున్నాయి. స్త్రీలకు స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించలేక పోతున్నాయి.

## కల్యాణరావు నాటికలు నాలుగు

పి జె వర్ధనరావు

సాహిత్య ప్రక్రియలలో నాటకానికి ప్రత్యేకస్థానం వుంది. రచయిత పాఠకుల మధ్యనున్న సంబంధం కంటే, నాటకకర్త ప్రేక్షకుని మధ్యనుండే సంబంధం భిన్నమైనది. రచయిత ప్రేక్షకుల మధ్యనటులు దర్శకుడు అనే మూడవఅంశం ప్రవేశించడంతో నాటకకర్త చిత్రించిన జీవితాన్ని తమ హావభావ నటనారీతులతో ప్రేక్షకుల కళ్లకు కట్టినట్లు నటించి వారిని ఉత్తేజపర్చగలరు నూటికి70 మంది పైగానిరక్షరాస్యులున్న మనదేశ ప్రజల్లో విప్లవభావాలను రేకెత్తించడానికి నాటకాన్ని పదునైన ఆయుధంగా వాడుకోవచ్చు నిజ జీవితంలోని దోపిడీని ప్రజల ముందు ప్రదర్శించడం ద్వారా వారిని చైతన్యవంతులను చేయడం సులభమవుతుంది. ఇంతటి పదునైన ఆయుధం పరిషత్ పోటీలకు వాళ్లిచ్చే షీల్డులకు పరిమితమవడంద్వారా దాని పదునును కోల్పోయి

---

ఈ దేశంలో యింకా స్త్రీలకు ఏ ప్రాథమిక హక్కులూ లేవు. మొత్తం కుటుంబ వ్యవస్థే స్త్రీల ప్రాథమిక హక్కులను హరించే పద్ధతిలో వుంది. ఇంత అంధకారంలో స్త్రీల హక్కుల గురించి సామాన్య ప్రజలలో కలుగుతున్న చైతన్యం ఆశాకిరణంలా కనిపిస్తోంది ఐతే ఈ చైతన్యం ఒక ఆచరణకు దారితీయాలి. ఆ ఆచరణకు కొన్ని సంఘాలు పని చెయ్యాలి అవి చాలా తక్కువ సంఖ్యలో వున్నాయి పి.యు.డి.ఆర్. వంటి ప్రజాతంత్ర హక్కుల సంఘాల మద్దతు మహిళా సంఘాలకు ఎంతో బలాన్నిస్తుంది.

పి. యు. డి. ఆర్ ప్రచురించిన ఈ చిన్న పుస్తకం మీద చర్చ జరగటం స్త్రీల యదార్థ స్థితి ప్రజలకు తెలియటం ఎంతో అవసరం.

---

INSIDE THE FAMILY – A Report on Women and Democratic Rights PUDR, Dr. (Ms.) Sudesh Vaid D-II Staff Quarters I P College for Women Shamnath Marg, Delhi-110054.

Price Rs. 2/-

మొద్దుబారింది. దీనిని మళ్ళీ ప్రజలమధ్యకు తెచ్చి ప్రజాపోరాటాల మీద పదును పెట్ట
వలసిన బాధ్యత ప్రజారచయితలు కళాకారులదే. అయితే విరసం ఇతర సాహిత్య ప్ర
క్రియలపై చూపిన శ్రద్ధ నాటకం విషయంలో చూపలేదనే చెప్పాలి. నాది నాటకం
తర్వాత చెరబండరాజు నాటికలు తప్ప మరే మీ ప్రచురించలేక పోయింది. ఆ కొరత
తీరి భవిష్యత్తులో మరిన్ని నాటికలు, నాటకాలు వెలువడనున్నాయనే దానికి గుర్తుగా
కా॥ కల్యాణరావు నాటికలు నాలుగు వెలువడ్డాయి.

నాటికలోని థీమ్ వాస్తవానికి ఎంత దగ్గరగా వున్నా విప్లవాత్మకంగా వున్నా
ప్రదర్శనకు యోగ్యం కాకుంటే దాని వలన ప్రయోజనం శూన్యం. ఎందుకంటే ఇది
ముఖ్యంగా దృశ్య కావ్యం కనుక. అలాగే పాత్ర చిత్రణ, నాటికుపయోగించిన
సంభాషణలు, సన్నివేశాల చిత్రణ సహజంగా ప్రజా జీవితానికి దర్పణం పట్టి
ప్రజలకు దగ్గరగా వుండకపోయినా రచయిత ఆశించిన ప్రయోజనం నెరవేరదు.
ఇవన్నీ సమపాళ్ళలో కలిసి వున్నదే మంచి నాటిక కాగలుగుతుంది అంటే దాని
రచనాలక్ష్యం నెరవేరుతుంది. వీటి మేలు కలయికే కా॥ కల్యాణరావు నాటికలని
చెప్పవచ్చు.

నేడు అమలులో వున్న మన అశాస్త్రీయ విద్యావిధానానికి వ్యతిరేకంగా జిజ్ఞాసను రేకె
త్తించవలసిన అధ్యాపకులు, అక్కరకురాని విద్యా విషయాలను ప్రశ్నించే విద్యా
ర్థులను ఇడియట్స్‌గా భావించి ఆలోచనలను అణచి వేస్తున్న విధానాన్ని చిత్రించే
నాటిక 'ఇడియట్'. విద్యావిధానంలోని లోపాలను ఎరిగుండికూడ మౌనంగావున్న ఈ
దేశ మేధావుల మీదికి ప్రశ్నల కొడవళ్ళెత్తిన నాటిక ఇడియట్. అయితే రచయితగా
మిగతా నాటికల్లోనే కా॥ కల్యాణరావు పరిణతి సాధించాడని పిస్తుంది, సమస్యను ఎత్తి
చూపడం కాదు నేడు కావలసింది. పరిష్కారం చూపడం విప్లవ రచయిత కర్తవ్యం
దానిని మిగతా నాటికల్లో సాధించాడని చెప్పవచ్చు. పెద్ద పెద్ద ఇంగ్లీషు డైలాగులు
వాడటం వల్లనూ, విద్యార్థులకు సంబంధించిన సమస్య కావడం చేతనూ కళాశాలల్లో,
పట్టణ ప్రాంతాలలో ప్రదర్శించుకోడానికి అనువైన నాటిక.

ఈ వ్యవస్థను ప్రశ్నిస్తూ, ఎదిరిస్తూ మార్చడానికి ప్రయత్నిస్తున్న యువత
రాన్ని అహింసా వాదులమని చెప్పుకుంటున్న ఈనాటి పాలక వర్గాలు ఎంతదారుణంగా

కిరాతకంగా కాల్చి చంపుతున్నదో చూపించే నాటిక అరుణ. స్వార్థపరుల చేతుల్లో, ఈ వ్యవస్థ కావలి కుక్కలైన పోలీసు మూకల తుపాకి తూటాలకు ప్రాణాలొడ్డుతున్న యువకులకు ప్రతీక 'అరుణ'. ఎన్‌కౌంటర్లన్నీ పోలీసు హత్యలే' అనే నినాదానికి సజీవరూపకల్పన 'అరుణ'

పేరుకు స్వతంత్ర దేశమైనా, ప్రజాస్వామిక దేశమైనా విశాలప్రజా రాసులకు ఈ దేశమొక జైలు దొంగలు, వ్యభిచారులు, ఖూనీకోరులు పెరగ డానికి అస్కారంలేని సమాజాన్ని నిర్మించవలసిందిపోయి, వాళ్లను జైళ్ళలో బంధించడంలోనే పరిష్కారం చూస్తుందీ వ్యవస్థ అంతేగాదు ఈ వ్యవస్థను ప్రశ్ని స్తున్న పేదప్రజానీకాన్ని బంధించడం ద్వారా ఉద్యమాలను అణచగలనను కుంటూంది. మొత్తం భారతదేశమీనాడు ఒక పెద్ద జైలుగా తయారయ్యింది. దీన్ని బద్దలు కొట్టి నిజమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సాంధించుకోవాలని చాటిచెప్పేదీ 'జైలు' నాటిక.

నూటికి 70 మంది గ్రామసీమలలో నివశిస్తూ భూస్వామ్య దారుణ దోపిడి పీడనలకు గురౌతున్నప్పుడు వాళ్ళను మేల్కొలిపి, వ్యవసాయ విప్లవాన్ని విజయ వతం చేయడమే నేడు మన ముందున్న కర్తవ్యం. కాబట్టే మన కళలు సాహిత్యం ముఖ్యంగా భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని చిత్రించేవిగా వుండాలి. ఈ లక్ష్యాన్ని పరిపూర్ణంగా సాంధించిన తొలిపొద్దు గ్రామాలలోని భూములన్నింటినీ సొంతం జేసుకొని, ప్రజల జీవితాలను తమ చెప్పు చేతల్లో నుంచుకుని, వాళ్ళ బ్రతుకుల్తో ఆట లాడ్తున్న కామయ్య లాంటి భూస్వాములకు వ్యతిరేకంగా పీడిత ప్రజలంతా కులమత భేదాలకు అతీతంగా సంఘటిత పడి పోరాడాలన్న సందేశానిచ్చే మంచి నాటకం తొలిపొద్దు. "చల్లపల్లి నీయింటి పేరయినంత మాత్రాన నువ్వు చల్లపల్లి రాజావి కాదని గుర్తు చేద్దాం" లాంటి డైలాగులు భూస్వామ్య కులాలలో అంటే కమ్మ, రెడ్డి, కాపు, రాజులాంటి అగ్రకులాలలో పుట్టిన పేదలు కూడ భూమి లేని నిరుపేద కులాలతో కలిసి భూస్వాములకు వ్యతిరేకంగా పోరు సాగించవలసిన కర్తవ్యాన్ని తెలియజేస్తాయి.

సజీవ పాత్రలు, సహజ సంభాషణలు, వాస్తవ సంఘటనలు నాటికలన్నింటిని ప్రదర్శన యోగ్యంగా తీర్చిదిద్దాయి. నాటకానికిచ్చిన నోట్స్ ప్రదర్శనలలో నటులకు ఎంతగానో ఉపకరిస్తుంది. ఎటువంటి ఇబ్బందులు లేకుండా, భారి సెట్టింగులలాంటి అనవసర హంగులు లేకుండా ఎక్కడైనా ఎన్నిసార్లయినా ప్రదర్శించుకోగల మంచి నాటికలు ఇవి. కా॥ సంగ్రామ్ అన్నట్టు ఈ నాటికలను వీధి నాటికలు గాకూడా స్టేజీ, మైకు, లైట్ల హంగులు లేకుండా ప్రదర్శించుకోవచ్చు.

ఇంత మంచి నాటికలను ప్రచురిస్తున్నప్పుడు అచ్చుతప్పులు రాకుండా చూచుకుంటే మరింత బాగుండేది. నాటికలు రాసేటప్పుడు నాటికలోని సంఘటనలు జరిగిన కాలాన్ని గమనంలోకి తీసుకోవాలి. 'అరుణ నాటికలో 6వ పేజీలో" డి యస్ పి వచ్చే వేళయింది జాగ్రత్త అని 13వ పేజీలో "ఇదిగో యస్ ఐ రేపు డి యస్ పి వస్తాడు గదా' అంటే S I "అవును సార్" అంటాడు మళ్ళ వెంటనే D S P వచ్చేవేళయింది జాగ్రత్త అని 14వ పేజీలో అంటాడు 17వ పేజీలో "ఇంక రెండు నిమిషాలలో D S P వస్తాడు" అంటాడు ఇలా D S P రాక విషయాన్ని సరీగ్గా చెప్పక పోవడ మంటే టైమింగ్‌ను సరిగ్గా పాటించడంలో అశ్రద్ధ చూపినట్లవుతుంది. అదే నాటికలో 19వ పేజీలో అరుణ ఎమర్జెన్సీ పేరుతో అందరి నోళ్ళు నొక్కి- ప్రజారాజ్యాన్ని పోలీసు రాజ్యంగా నడిపిస్తు.... ''అంటాడు. అరుణ లాంటి పాత్ర చేత ఎమర్జెన్సీకి ముందున్నది ప్రజారాజ్యం అని చెప్పించడం తప్పు. ఇటువంటి చిన్న లోపాలను సరిజేసుకుంటే మరింత పరిపూర్ణత సాధించుకుంటాయి. మంచి విప్లవాత్మక నాటికలు లేవని చింతించే ప్రజాకళాకారుల మీద వీటిని జనంలోకి తీసుకుపోవాల్సిన బాధ్యత ఎంతయినా వుంది.

1. ఇడియట్ (నాటిక) వెల : తెలియదు
2. అరుణ (నాటిక) వెల : నాలుగు రూపాయలు
3. జైలు (నాటిక) వెల : మూడు రూపాయలు
4. తొలిపొద్దు (నాటిక) వెల ; ఆరు రూపాయలు

ప్రచురణ : విప్లవ రచయితల సంఘం, శ్రీకాకుళం జిల్లా; కల్యాణరావు
ప్రతులకు : 1 సి యస్ ఆర్ ప్రసాద్, సి 108, శ్రీనివాస నగర్ కాలనీ, గుంటూరు,
2 సోషలిస్టు బుక్ సెంటర్, ట్రంక్ రోడ్డు, ఒంగోలు
3 సృజన , హనుమకొండ, వరంగల్
రచయిత : జి కల్యాణరావు

## ఈ నాటికీ...

_వి. కె. ఆర్.

శిశ్నముందు కదలాడే నిజాల్ని హృదయాలకు హత్తుకునేలా చెక్కటమే నేటి కవిత్వం. జరుగుతున్న ప్రజాపోరాటాలకు విప్లవ కవిత్వం అద్దంపట్టాలి. ప్రతి కవితా ఏదోఒక పోరాటానికి అక్షరరూపంకావాలి. పోరాటాలను వూహించి రాసే కవిత్వం కాల్పనిక కవిత్వం మాత్రమే అవుతుంది.

ఈసంకలనంలోని 54 కవితల్లో ఎక్కువ కవితలు పోరాటాల్ని ప్రతిబింబించేవిగా కాక ఏదో మేరకు పోరాటానికి ఉపయోగపడేవిగా వున్నాయి.

అన్నీ మారుతున్నట్టుగానే కాలంతోపాటు కవిత్వంకూడా మారుతుంది, అయితే కవి ఆలోచనా విధానం బట్టి, కవి నిబద్ధతబట్టి కవివున్న సామాజిక పరిస్థితులను బట్టి కవితావస్తువు, వ్యక్తీకరణలు, ప్రయోగాలు, కవితాసామగ్రి మారిపోతాయి. నిఖిలేశ్వర్ తనదంటూ ఓమార్గం ఏర్పచుకున్న పరిణతి చెందినకవి అందుచేత నిఖిల్ పాత రచనలతో ఈసంకలనంలోని కవితల్ని పోల్చిచూసినట్టయితే, ఈనాటికీ ఆయనకవిత్వంలో వర్గదృక్పథం మారలేదు. వర్గప్రయోజనం ఒకటిగానె కన్పిస్తుంది. దానికి కారణం అయన ఉన్నసామాజిక పరిస్థితులు అందుకు భిన్నంగా లేకపోవటమే_

అయితే-

నగ్జల్‌బరీ, శ్రీకాకుళ పోరాటాల ప్రేరణతోరాసిన కవిత్వం ''మండుతున్న తరం"లోని వాడీ, వేడీ ఈ సంకలనంలో చాలా తక్కువ. మండుతున్న తరం మండించి నంతగా ఈ సంకలనంలోని కవితలు మండించలేక పోవచ్చు కానీ మంటలు రాజెయ్యటానికి ఓ ఇంధనంగా వాటి పరిమితుల్లో అవి వాటి బాధ్యతలను నిర్వర్తించ గలవనటం వాస్తవం.

బాధ, ఆందోళన, ఆవేశము, కోపమూ లేకుండా కవితలు రాయటం కష్టమౌతుంది. కవిముందు స్పందించకుండా తనకవితలో సరైన భావాలు వ్యక్తం చెయ్య లేడు. నిఖిలేశ్వర్ ప్రతి కవితలోనూ అయన గుండెచప్పుళ్ళను, మానసిక స్పందనలను రికార్డు చేసారు,

''మననోటి దగ్గరికి వస్తున్న ముద్దలో
ఎందరి ఆకలి చూపుల మెతుకులు
మన పాలిస్టర్ దుస్తులు మెరుపుల్లో
ఎందరి చిరిగిన దుస్తులు మానాభిమానాలు"

అంటూ కవి దేశంలోని దారిద్ర్యాన్ని, దైన్యాన్ని కళ్లముందు పెడుతున్నారు. "ఖాళీగిన్నెలను తలలమీద బోర్లించుకున్న సగటు ప్రజల" గూర్చి ఆరని ఆవేశంతో రాస్తున్నారు.

కవి వాస్తవాలకు దూరంగా లేరు. నిత్యం జరుగుతున్న సంఘటనలను, సంఘర్షణలను కవిత్వీకరించటంలో వైవిధ్యం చూపుతున్నారు.

"దారిద్ర్యపు భారాన్ని కొండల్లా మోస్తూ
ఎదురు తిరిగి
బతికే హక్కు మాదికూడానంటే
బొష్టంగా మారణహోమానికి
బలైపోతున్న జీవితాలు''

గూర్చి కవి ఈనాటికీ రాస్తున్నారు. అలాంటి జీవితాలు ప్రతిహింసాజ్వాలలుగా మారుతాయని చారిత్రిక సత్యాన్ని వివరిస్తూ "అణగారిన ప్రతిఒక్కడి ఆశలే- రాజీ లేని రేపటి మన ప్రపంచం'' అంటున్నారు.

''ఓట్ల విత్తనాలు చల్లిన మహాజనులారా" కవితలో ఓట్లువేసి గెలిపించిన మన నాయకుల దగాను, మోసాన్ని చిత్రిస్తూ మళ్ళీఓట్లువేసి మోసపోకూడదు, ఓట్లువేసి కష్టాలు కొనితెచ్చుకోకండి. "కష్టాల చరిత్రతిరిగి తనను తానే రాసుకుంటున్నది" వెయ్యాల్సినవి ఓట్ల విత్తనాలుకాదు పోరాట విత్తనాలు చల్లాలని చెప్తున్నారు.

"ఈమాతృదేశపుఒడిలో ఆకలిచిచ్చుకు తాళలేక కరెంటు వైర్లకు వేలాడి మాడి పోతున్న మనసోదరుల చేతులు పట్టిని మందులా మందుగుండు సామాగ్రిలా పేల్చ గలనని" అర్థం చేసుకుంటున్నాయని రాస్తున్నారు.

మట్టిని తొక్కేకాళ్ళు, మట్టిని పిసికేచేతులు ఏ చైతన్యం వైపు వెళ్తున్నాయో, ఏ మార్గాల్ని తొక్కుతున్నాయో కవి స్పష్టం చేస్తున్నాడు.

అటు చూడు నిరంతరంగా శిఖరాగ్రం నుండి
అడవుల్లోంచి పారుతోంది మానవజల
తుపాకులను జైళ్ళను నిలువునా ముంచి
నగరాల నాగరికతను పెంచుతున్న
చేతులకు బలాన్నిస్తున్నాయి జల విద్యుత్తులా!

మానవజల ఎక్కడ నుండి ఎక్కడకు ఎలా ప్రవహిస్తుందో తెలియజెస్తున్నారు.

"ఈ నాటికీ / ప్రజాపోరాటాల బలంతో / ఎదురు తిరిగే చేతుల కాగడాలతో / దోపిడి చీకట్లను చీలుస్తు / నిరాటంకంగా ప్రతిఘటిస్తున్న శ్రమజీవులు" అణు విద్యుత్తులా సాగిపోతున్నారని కవి యదార్థ గాథల్ని తన సంపుటిలో సంక్షిప్తం చేసారు

'వ్రీల వ్యాలీలో కొట్టే పల్టీలు' స్టీల్ లైఫ్ రంగుల్లో రోడ్ రోలర్ ప్రజా స్వామ్యం లాంటి ఇంగ్లీషు తెలుగు కలగలిపిన పదాలు శబ్దంతో కూడి కొత్తగా వున్నాయి.

నెమ్మదిగా కూచున్న సాయంత్రాలు, చలినే వణికించే కన్నీటిగీతాలు. మంచుతో పోటీ పడుతూ మరిగే రక్తం, మసిబారిన చంద్రవంక లాంటి వ్యక్తీకరణలు స్పష్టంగా వుండి బాగున్నాయి.

కవిత్వం ప్రజాపంథాలో రాయాల్సివుంది. గజిబిజి కలిగించే ప్రతీకలతో గందరగోళం చేయాటాన్ని ప్రతి విప్లవ కవీ దూరం చేసుకోవాల్సివుంది. చెరువులో చేతులను ముంచుతున్న సూర్యుడు లాంటి వ్యక్తీకరణలు ఒకటి రెండు చోట్ల ఈ సంకలనంలో కనిపించినా నిఖిల్ మిగతా సంకలనాలతో పోల్చి చూస్తే ఈ సంకలనం కొంత స్పష్టంగానే వుంది.

నిఖిలేశ్వర్ కవితా సంకలనం
ప్రచురణ: నవతా పబ్లికేషన్, నల్లకుంట, హైద్రాబాద్
వెల: రు. 10-00 (ప్రతులకు నవతా పబ్లికేషన్)

మానవతా విలువలు :

# సారా సంవత్సరానికి "సలాకుల" స్వాగతం

మళ్ళీ సారా సీజన్ వచ్చింది. కొత్త సారా సంవత్సరానికి రెవెన్యూ శాస్త్ర పండితులయిన 22 జిల్లాల కలెక్టర్లు వారం వర్జ్యం చూసి స్వాగతం పలికారు. ప్రజల బలహీనతను సొమ్ము చేసుకునే హక్కు మీద గుత్తాధిపత్యం దాడోయే సారా సంవత్సరంలో ఏ నగరంలో ఏ తాలూకాలో ఎవరెవరికి చెందుతుందో, దాని నుండి ప్రభుత్వానికి ఎక్సైజ్ రెవెన్యూ ఎంత వస్తుందో, ప్రభుత్వ సారాయి దుకాణాలలో సారా ఎంతకు అమ్ముతుందో, వేలం పాటలలో శాస్త్రీయంగా నిర్ణయించారు. అథవా, శాస్త్రీయంగా నిర్ణయించామని అనుకున్నారు. వాళ్ళ చాదస్తంగాని, ఆ నిర్ణయం వాళ్ళకెవరు వదిలారు? పెట్టుబడుల పోటీ ధరల్ని నిర్ణయిస్తుందనే సిద్ధాంతాన్ని అనుసరించి సారా పెట్టుబడుల పోటీ సారా ధరని నిర్ణయిస్తుందని ఎకనామిక్స్ ప్రొఫెసర్లు నమ్ముతారు. అది వాళ్ళ వృత్తి విశ్వాసం. వాళ్లు తప్ప వేరే ఎవ్వరు నమ్మరు. సారా గుత్తేదార్లు అసలు నమ్మరు.

సారా గుత్తేదార్లలో నానా రకాల వాళ్ళున్నారు. కాంగ్రెస్ వాళ్లున్నారు. కమ్యూనిస్టులున్నారు. వాళ్ళకూ వీళ్ళకూ అయిన వాళ్లున్నారు. ఇద్దరికీకాని వాళ్ళున్నారు, సినిమా వాళ్ళున్నారు, సమితి ప్రెసిడెంట్లున్నారు, సిసలయిన గూండాలున్నారు, ఎన్ని రకాలున్నా అందరూ ఒక విషయం మాత్రం ఉమ్మడిగా ఒప్పుకుంటారు. తమలో తాము పోటీపడి వేలం పాట పెంచడం కన్న మూర్ఖత్వం మరొకటి ఉండదు. ఒక వీధి కుక్కలన్నీ సిండికేట్ కట్టి పక్క వీధి కుక్కను తరిమికొట్టినట్టు కాగలవాళ్ళంతా ఒకటయి కానివాడిని బయట నిలబెట్టి వేలం పాట రెండవ మాట లేకుండ ముగించాలన్నది వాళ్ళ దృష్టి. అది వాళ్ళ దృష్టి అని ప్రభుత్వానికి గూడ తెలుసు. అందుకే తన జాగ్రత్త తాను తీసుకుంటుంది, ఎందుకంటే (ఒక ప్రభుత్వ అధికారి నోరుజారి చెప్పినట్లు) ప్రభుత్వం బీదసాదల మీద ఈ పథకమనీ ఆ పథకమనీ పెట్టే ఖర్చంతా 60-70 కోట్లు వుంటే ఆ బీదల జేబులు కొట్టి సారా రెవెన్యూ రూపంలో తిరిగి పొందేది అంతకంటే ఎక్కువ ఉంటుంది. కాబట్టి ఆ రెవెన్యూ పోగొట్టుకుంటే బీద సాదల మీద నిజంగానే ఖర్చయినా చేయాలి. లేక ఆ పథకాలకు తిలోదకాలిచ్చి వోట్లయినా పోగొట్టుకోవాలి. ఇంత కీలకమయిన రాబడిని ఎకనామిక్స్ ప్రొఫెసర్లు చెప్పే సిద్ధాంతాలకు వదిలేయడం ప్రభుత్వానికి ఇష్టం లేదు. అందుకని

కిందటి సంవత్సరం రెంటల్ మీద ఈ సంవత్సరం రెంటల్ కనీసం 30 శాతం ఎక్కువ ఉండాలని అన్ని జిల్లాల కలెక్టర్లకూ ఆదేశాలు జారీ చేసింది.

పోటీ వల్ల కాక ఎక్సైజ్ ఒత్తిడివల్ల రెంటల్ పెరిగితే సారా కాంట్రాక్టర్లకూ మౌలికంగా అభ్యంతరం ఉండదు. ఎందుకంటే అప్పుడు తాము అమ్మే సారాధర పెంచితే అభ్యంతరం తెలిపే అర్హత ప్రభుత్వానికి ఉండదు. పైగా ఈ పెరిగిన ధరే తాము అమ్మే దొంగసారాకుగూడా వర్తిస్తుంది. కాబట్టి దీనివల్ల లాభంగూడ ఉండవచ్చు. అయితే రెండుచిక్కులు మాత్రం ఉన్నాయి. గత మూడునాలుగేళ్ళుగా తెలంగాణా జిల్లాలంతటా, పెరుగుతున్న సారాధరలకు వ్యతిరేకంగా జనం తిరుగబడుతున్నారు. వాళ్ళకు విప్లవపార్టీలు మద్దతు నిస్తున్నాయి. ఈసారిగూడ తిరగబడతామని హెచ్చరించారు. కరపత్రాలూ పోస్టర్లూ పడ్డాయి. ఇది సారా కాంట్రాక్టర్లకు పెద్దతలనొప్పి. జనం తిరగబడితే దుకాణాలు బంద్ అవుతాయి. అమ్మకం వుండదు ఒక్కొక్కసారి మరీతెగిస్తే వాళ్ళుసారాపీపాలు బద్దలుకొట్టి ఆ పవిత్రజలాన్నిబయట పారబోయడంగూడకద్దు అంతకంటే పవిత్రమైన సారా కాంట్రాక్టర్ల ప్రాణాలమీద చేయిచేసుకున్న ఘటనలగూడ లేకపోలేదు వాళ్లను అణచడానికి పోలీసుల అండ కావాలి దాన్ని సాధించాలంటే ఇచ్చుకోవలసినచోట అడిగినంత ఇచ్చుకోకతప్పదు. ఇదంతా పెద్దచిక్కే రెండవచిక్కు లంబాడీ కోయ తదితర గిరిజనులతో వస్తుంది అబ్కారీ చలవవల్ల ఇంట్లో వండుకుంటే అయ్యేఖర్చుకంటె అయిదారురెట్లు ఎక్కువ ఖర్చుపెట్టి బజార్లో సారా ఎందుకు కొనుక్కొని తాగాలన్నదివీళ్ళప్రశ్న సారామీద ఎక్సైజు గుత్తాధిపత్యం వచ్చిననాటినుండి ఆ పగటిదోపిడీని ఆ దోపిడీచేత నల్లవ్యాపారంగా పరిగణించబడే గుడుంబా తయారీతో వాళ్ళు ఎదుర్కొంటూనే వున్నారు. అది బెల్లంసారా కావచ్చు, విప్పసారాకావచ్చు- ఏదయినా ప్రభుత్వ సారాకంటే చాలా రెట్లు చవకే ధరపెరిగేకొద్దీ గుడుంబా వండకం వాడకం పెరగకతప్పదు దీన్ని ఎదుర్కోవడానికి సారాగుత్తేదార్లు గుండాల మందను పోషించాలి. వాళ్ళకు కడుపు కింతపడేస్తేచాలదు. కండలు పెంచేంతతిండిపెట్టాలి. జీపులు వ్యాన్లూ కొనుక్కోవాలి లంబాడా తండలమీద, కోయగూడేలమీద, జీపులతో వ్యాన్లతో దాడులుచేయాలి జనాన్ని చావచితగ్గొట్టాలి. కేసులుకాకుండా పోలీసులకూ ఎక్సైజు వాళ్ళకూ లంచాలు ఇచ్చుకోవాలి. ప్రజాందోళన ఫలితంగా ఎన్నడయినా కేసయితే వకీళ్ళ ఖర్చులు పెట్టుకోవాలి ఇదిగూడ పెద్దచిక్కే

ఇన్ని సామాజిక శక్తుల సంఘర్షణ నేపథ్యంలో నూతన సారా సంవత్సరం ఉదయించింది. ఈ సంఘర్షణ పరిష్కారాన్ని బట్టి ఆయా ప్రాంతాలలో ఎక్సైజ్ రాబడి, గుత్తేదార్ల లాభం, ప్రభుత్వ సారా దుకాణంలో వంద గ్రాముల ధర నిర్ణయ మయ్యాయి. కొన్ని చోట్ల ప్రభుత్వం కోరుకున్న 30 శాతం పెరుగుదల లభించింది గాని వరంగల్‌లో అది కుదరలేదు. వరంగల్ తాలూకా రెంటల్ 39 లక్షల రూపా యల నుండి 42 లక్షలకు మాత్రం పెరిగింది–అంటే 8 శాతం లోపే ఇంత తక్కువ పెరిగి నందుకు జిల్లా కలెక్టరు తప్ప వేరే ఎవ్వరూ బాధపడలేదు. జనానికి పెరగకుంటే నే మంచిది సారా కాంట్రాక్టర్లంటారా, వాళ్ళకి పెరిగినా పెంచినంతా మిగులుతుంది. తగ్గితే అమ్మినంత మిగులుతుంది. కలెక్టరు బహుశా ఇంకొంచెం పెంచమని బలవంతం పెట్టేవాడేమో, కాని సారా కాంట్రాక్టర్లంతా కలిసి ఒక చక్కటి నాటకం ఆడారు. వేలం పాట జరుగుతున్న చోట ఒక బాంబు లాంటి పదార్థాన్ని పడేసి అదిగో తీవ్ర వాదులు దాడి చేస్తున్నారు అని బెదిరించి వేలం పాట ముగించారు. డి ఐ జి దొర పోలీసులకుగూడ 'కళాహృదయం' ఉందని రుజువు చేసాక సారా కాంట్రాక్టర్లు మేం అంత తీసిపోయామా అనుకున్నా రేమో,

అక్కడితో సారా గుత్తేదార్లు సంతృప్తి చెందలేదు తమకు చిక్కులు తేగల ఇద్దరి మీద– విప్లవకారులమీద, లంబాడాల మీద, – ముందు బెదిరింపు చర్యగా దాడి చేయాలని నిర్ణయించుకున్నారు ఇంకా వేలం పాట ఒకవైపు పూర్తికాకముందే గుడుం బాకోసం దాడులు మొదలు పెట్టారు. సాయంత్ర మయితే పట్టణం నుండి వాడ వాడలకు పరిసర గ్రామాలకూ వాహనాల పయనం మొదలవుతుంది. చూడ ముచ్చటగా మూడంటే మూడు బండ్లుంటాయి. సారా కాంట్రాక్టరుగారూవారి అంగరక్షక బృందం కూర్చునే ఒక జీపు, వెనుక ఎక్సైజ్ పోలీసుల జీపు, ఆ వెనుక ఒక వ్యాను నిండా ముప్పై నలభై మంది కండలు తిరిగిన మెరికెలలాటి గుండాలు. వాళ్ళ చేతులలో రకరకాల ఆయుధాలుంటాయి. కర్రలు గొడ్డళ్ళు, బరిసెలు, గొలుసులు సలాకులు, కత్తులు, చాకులు, ఉంటాయి. వీటన్నిటిలోనికీ ప్రసిద్ధ మయినవి సలాకులు ఇవి గుండ్రంగా కాకుండ నలుచదరంగా వుండే ఇనపరాడ్లు ఒక మొన తగిలేటట్టు తల మీద కొడితే తలపగలడం ఖాయం ఈ ఆయుధాలుకాక కాంట్రాక్టరుగారి దగ్గర లైసెన్స్‌డ్ రివాల్వర్ ఉంటుంది దాన్నివారు సినిమాలలో విలన్‌లాగ అప్పుడప్పుడుగాలిలోకి

కొలుస్తుంటారు అసలుపనిమాత్రం లైసెన్స్ అక్కరలేని ఆయుధాలతో జరిగిపోతుంది ఊళ్ళమీదపడి జనాన్ని చితకబాదుతారు తలలూ కాళ్లూ విరగ్గొడతారు ఇంట్లోని కుండలూ బిందెలూ పగలగొడతారు (వీటిలో గుడుంబా కాచుకుంటారని వాళ్ల అనుమానం) స్త్రీలను ఎత్తుకుపోయి అత్యాచారం చేస్తారు ఎక్సైజ్ పోలీసులు కురుక్షేత్రంలో శ్రీకృష్ణపరమాత్మలాగ దీన్నంతా ప్రశాంతంగా తిలకించి, అంతా అయిపోయాక దెబ్బలు తిన్నవాళ్లమీదే గుడుంబా దొరికిందని కేసు రాసుకునిపోతారు

ఈవిధంగా ఆగష్టు 30 సాయంత్రం రుద్రమ్మ ఏలిన వరంగల్‌కోట ప్రాంతం మీద దాడిచేసారు ఒకయింటిలోనికిదూరి కళ్ళుసరిగ్గా కనిపించని ముసలాయనను పట్టుకొని బయటికివచ్చారు ఆయనకొడుకు రాములు (కాకతీయ విశ్వవిద్యాలయంలో ఎం ఫిల్ విద్యార్థి, పార్టు-టైం లెక్చరర్) తనతండ్రిని ఎందుకు తీసుకుపోతున్నారని అడ్డం వచ్చాడు ఆదే వరంగల్‌కోటలో మూడేళ్ళక్రితం అదేసారా కాంట్రాక్టరు యాదగిరి అనే యువకుడిని చంపించాడు వరంగల్‌కోట ప్రాంతపు విద్యార్థియువజనుల అలజడి ఫలితంగా అతనిమీద పోలీసులు కేసుపెట్టక తప్పలేదు అకసి ఇంకా తగ్గని కాంట్రాక్టరు రాములును ఇనపరాడ్లతోకొట్టి ఎత్తిజీపులో వేసుకున్నాడు అడ్డం వచ్చిన వాళ్ళమీదికి కత్తులూ సలాకులూ తీసారు జీపులో పోతూండగా రాములును పిడికిళ్ళతో విపరీతంగా గుద్దారు కాంట్రాక్టరు స్వయంగా ఒకచేత్తో స్టీరింగ్ నడుపుతూ రెండవ చేత్తో రాములుగొంతు నులిమాడు "మీరు కరత్రాలు వేస్తే మా వ్యాపారం ఆగిపోతుందనుకున్నావా" అనీ "యాదగిరిని చంపినకేసు నామీద పెట్టించింది నువ్వేకదరా" అనీ కసిగాఅతన్ని కొట్టించాడు పక్కఎముక ఒకటివిరిగింది అస్థితిలో అతన్ని పోలీసుస్టేషన్‌కు తీసుకుపోయి కాంట్రాక్టరే అప్పజెప్పాడు జనంమీద దాడిచేసి చావగొట్టి దెబ్బలు తిన్నవాల్లను తామే స్వయంగా పోలీస్‌స్టేషన్‌కు అప్పజెప్పి వాళ్లమీదే కేసుపెట్టించే ఘనత ఒక్కసారా కాంట్రాక్టర్లకే దక్కుతుంది వాళ్లకు పోలీసులతో ఎంతటి లాలూచీవుందో దీన్నిబట్టి అర్థమవుతుంది రాములును పోలీసులు ఆస్పత్రికి తీసుకుపోయారు అడ్మిట్ కాకుండ చూడాలనీ దెబ్బలునయంకాకముందే అరెస్టుచేసి తీసుకుపోవాలనీ పోలీసులు ప్రయత్నించారు అతని మిత్రుల జాగ్రత్తవల్ల ఆ ప్రమాదం తప్పింది సారా కాంట్రాక్టర్లూ ఎక్సైజ్ సిబ్బందీ ఎంతో శాంతియుతంగా గుడుంబాకోసం వెతకడానికిపోతే "తీవ్రవాది" అయిన రాములు తనముఠాతో వాళ్లమీద

దాడిచేసాడని, వాళ్ళు ఆత్మరక్షణార్థం రెండు దెబ్బలు (చేతులతో మాత్రమే) వేసి, పోలీసులకు తమ డ్యూటీ చేయడంలో మనమందరం సహకారం ఇవ్వాల్సిన అవసరం ఉందనే సదవగాహనగల పౌరులు కావడంచేత అతన్ని జీపులో వేసుకొని తమ సొంత డీసెల్ ఖర్చుతో పోలీస్‌స్టేషన్‌కు తీసుకొచ్చారనీ, అడిషనల్ ఎస్.పి ఒక ముచ్చటయిన కథ అల్లాడు. పైగా రాములే అరెస్టు తప్పించుకోవడంకోసం డాక్టర్లను బెదిరించి ఆస్పత్రిలో అడ్మిట్ అయ్యాడని ఒక కొసమెరుపు చేర్చాడు. విరిగిన పక్కటెముక గూడ అతనే విరగ్గొట్టుకున్నాడేమో తెలియదు- "తీవ్రవాది" గదా, ఎంతకయినా తగ్గవాడే.

వారం తిరిగి తిరక్కముందే ఇంతకంటే ఘోరమయిన చర్య జరిగింది. వరంగల్ పట్టణానికి 25 కిలో మీటర్ల దూరంలో వున్న పల్లార్‌గూడెం అనే గ్రామాన్ని అనుకొని వున్న పోచంపల్లి తండా మీద సెప్టెంబర్ 7 ఉదయం 9 గంటలప్పుడు సారా కాంట్రాక్టర్లు, ఎక్సైజ్ సర్కిల్ ఇన్‌స్పెక్టరు, కొందరు సాయుధ పోలీసులూ దాడి చేసారు. ఇంట్లో భోజనం చేస్తున్న గుగులోతు హనుమంతు మీద పడి చితగ్గొట్టారు. అతని వీపు వాతలు తేలింది. నెయ్యికుండను గుడుంబా కుండ అనుకొని పగలగొట్టారు. అతని పెద్దన్న మంక్యా అడ్డం పోతే అతన్ని గూడ ఇనుప సలాకులతో కొట్టారు. అతనికి ఒక వేలు విరిగింది. అడ్డం వచ్చిన స్త్రీలను 15 మందిని తలల మీద, వీపుల మీద, సలాకులతో కొట్టారు. గుగులోతు గుజిరి తల చిట్లింది. ఇట్లా జనాన్ని కొడుతూ తరుముకుంటూ వస్తుంటే పొలాలనుండి హనుమంతు చిన్నన్న గుగులోతు సమ్మలు ఎదురొచ్చాడు. అతన్ని కాంట్రాక్టరు స్వయంగా సలాకుతో రెండు బలమయిన దెబ్బలు వేసి కింద పడేసాడు. అతని ముసలి తల్లి అతని మీద పడితే ఆమెనుగూడ వీపుమీద బాది లాగి విసిరేసాడు. తలనుండి రక్తం కారుతున్న సమ్మలును జీపులో వేసుకొని బయలు దేరారు, దారిలో ఎదురయిన గగులోతు పంతులును గూడ జీపులో వేసుకున్నారు. మహ్బూపురం క్రాస్‌రోడ్స్ దగ్గర ఇద్దరినీ జీపు నుండి కిందపడేసి కాంట్రాక్టర్ గుండాలు బూటు కాళ్ళతో తొక్కారు. అక్కడినుండి తీసుకుపోయి తామే గీజుకొండ పోలీసుస్టేషన్‌లో అప్పజెప్పి లంబాడా లంజకొడుకులు గుడుంబా తాగి తమలో తాము కొట్టుకుని చంపుకున్నారు. అని ఎస్ ఐకి చెప్పారు. అపస్మారక స్థితిలో మహాత్మాగాంధి స్మారక ఆస్పత్రికి తరలించిన సమ్మలు కొద్దిగంటలలో ప్రాణంకోల్పోయాడు.

# విద్వద్యాభస్వామ్యం

కాళీ

మూర్తీ భవించిన జ్ఞానావతారం లా
కనిపించే ఆచార్య దైవ పిత
ఉదయం జోధ్‌పూర్ కోటూ
సాయంత్రం సఫారీసూటూ
సులోచనాలు మౌన గంభీర వదనం
పాంచ్‌సౌపచ్చన్ డన్‌హిల్ డంకన్
శ్వేతతూతురాల తుషార
లోకాల్లో విలాసంగా విహరిస్తాడు.
క్షణం తీరిక లేని మనిషి
ఉన్నత పదవులు విదేశీయానాలు
ఇంటర్నేషనల్ ఫైవ్‌స్టార్ సెమినార్లు
సమావేశాలు - స్కాచ్‌విస్కీలు
విధానాలు - నిర్ణయాలు
ఇనాగురేషన్లు - వాలెడిక్టరీలు
విస్తరణోపన్యాసాలు - గంభీర సిద్ధాంత చర్చలు
సౌందర్య మంద్ర మంత్రోచ్చారణలు

---

పోచంపల్లి తండా శాసనసభ్యుడు ఓంకార్‌గారి మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ ప్రభావంలో ఉన్నట్లు లెక్క. తండాలోని పార్టీ కార్యకర్తలు పోలీసులమీద ఒత్తిడి తీసుకొచ్చి ఎస్‌ఐ చేత స్వయంగా పంచనామా చేయించి సారా కాంట్రాక్టరుమీద హత్య కేసు పెట్టించగలిగారు. పెద్దనాయకుడు మాత్రం ఆరోజులలో రాష్ట్రవ్యాప్తంగా సాగుతూన్న ప్రజాస్వామ్య యజ్ఞంలో మెడదాకా నిమగ్నమయిన కారణాన తన అనుచరుడి మరణానికి సంతాపం సహితం పత్రికా ముఖంగా ప్రకటించినట్లులేదు. ప్రజాస్వామ్యాన్ని హైదరాబాద్‌లో కాపాడుకుంటే చాలు, గుగులోతు సమ్మలులాంటి అనామకజనం ఒకడు పోతే ఇంకెందరు లేరు?

కె. బాలగోపాల్

'ఉదార ప్రగతిశీల సంస్కరణవాదం'
ఏరోటికాడ అపాటే
ఎక్కడ కెళ్ళినా
బిల బిల మంటూ చరించే పిల్లలకోడే

దైవపిత రెక్కల్లో
పొదిగి ఎదిగిన
ఉష్ట్రి పక్షి మేధావులు
విద్యాదుస్సామ్యాన్ని
విస్తరింప చేస్తారు,
దైవపిత పరిణామం
'అత్యంతానసక్తిదాయకం'
అతని మేధస్సు
వృత్తిపర శిఖరాగ్రాల కెగిరే
వ్యూహాలను సృష్టించే
కంప్యూటర్
శిఖరాగ్రాల కెగరడానికి
'స్ప్రింగ్ బోర్డులు' సృష్టిస్తాడు.

ఆచార్య దైవపిత తనకు తాను
పరమసంతోష పరుడిగా భ్రమించే
దుఃఖభాజనుడు
ఈ వ్యవస్థలో
మధ్యే మార్గం-రాజీవాదం
సృష్టించే వైరుధ్యం
సంతోషం _మన స్తాపం
చివరకు 'హృదయ వైఫల్యం"

ఇక దైవపిత పుత్రి గణం

రకరకాల రంగుల
పక్షుల కూటమి
అందులో కొన్ని
మార్క్సిస్టేతర ప్రగతిశీలభావజాలకులు
విప్లవ విరాజకీయ మేధావులు
ఇంకా కొన్ని
వ్యక్తిత్వం స్వాతంత్ర్యం నేరని
బానిస మనస్తత్వ అర్థ-మేధావులు
శుద్ధ దైవపిత తాళికులు-పరస్పర తాళికులు
స్వయం ప్రయోజన అలీన ప్రచార సాధనాలు
అంతిమంగా
దళిత దళారీ మేధావులు-అధికార భావజాలకులు
వీరి ఏకైక జీవితాశయం
"బంగారు గడప"ల్ని దాటడం
వారి అదిమ విధేయతే
దైవపితకు సర్వ జగద్రక్ష।
శిష్యకోటి జంతు జాలంలో
దైవపిత ఏలే విద్వద్భూస్వామ్య సామ్రాజ్యం
సజావుగా విరాజిల్లుతూనే ఉంది
ఇదొక విద్వత్ సిల్వికల్చర్

ప్రశ్నించే మేధస్సుల ఊహలకు
"విషపు రెక్కల్ని తొడిగే"
కార్యక్రమాలు జరుగుతూనే ఉంటాయి.
సరి అయిన ఆలోచనలు ప్రక్కదార్లు పట్టింప బడూతూనే ఉంటాయి.
దైవపిత సృష్టించిన
ఊహా స్వర్గ లోకపు మెట్లు చకాచకా ఎక్కిపోవాలనుకునే
అమాయకులు
కుంజర శవంలో దూరిన నక్కలచే

నిత్యం మోసగింప బడుతూనే ఉంటారు.
అధునిక కౌటిల్యంతో
రాజ్య సహాయంతో
దైవపిత మంత్ర-తంత్రాలను బహిర్గతం చేసే
'తిరుగుబాట్లు',
అణిచి వేయబడుతునే ఉంటాయి
గొంతులు కోసుకునే పోటీలో
సమాజ విజ్ఞానం సరుకు
ఉత్పత్తి అవుతూనే ఉంటుంది
ప్రమాణాలు-ఫలితాలు
విదేశీ- (స్వ) రాజ్య పరిశోధనా సంస్థల మెప్పుకోళ్ళు
బహుమానాలు-పదవులు
లభ్యమవుతునే ఉంటాయి.
స్వేచ్ఛావాయువుల్ని పీల్చాలను కునే

మేధావులారా
ఈ అభాస నాటకానికి తెరపడబోతోంది
సమాజ విజ్ఞానానికి పునాది
ప్రజల జీవన్మరణ సంఘర్షణ
విద్యాభూస్వామ్యపు కోటల్ని బద్దలు కొట్టండి
నిస్తేజ స్తబ్ధతా సంకెళ్ళను ఛేదించండి-

సంకెళ్ల కలాలు:

# సంకెళ్లు విరుస్తున్న "బందీ"

ఇవాళ మానవుడిని అన్న స్పృహ ఉన్నవాడి దృష్టంతా వర్గపోరాటం మీద కేంద్రీకరించ బడివుంది. దానితో ఏదో ఒకరకమైన ప్రమేయం పెట్టుకోకుండా ఎడంగా వుండటం సాధ్యంకాని పరిస్థితి సమాజమంతా వ్యాపించివుంది. వర్గపోరాటంలో కార్మికవర్గ విజయం కోసం కృషి చేసే వాళ్ళను దాన్ని నిషేధాత్మక దృక్పథంతో చూసేవాళ్ళు రకరకాల నిర్బంధాలకి గురిచేస్తారు.

ఆక్రమంలో భూస్వాములు, వారి అనుయాయులు తైతాంగ కార్యకర్తల మీద దాడులు చేస్తారు. ఆ కార్యకర్తల్ని హత్యచేస్తారు. కూలి పోతున్న తమ వ్యవస్థను చూసుకునే ధైర్యంచాలక ఆ ఉన్మాదంలోంచి, భయంలోంచి, పిరికి తనంలోంచి, దురాశలోంచి మొండి ధైర్యం తెచ్చుకుని విధ్వంసన సాగిస్తారు.

తమ స్వాములు ఇలా కష్టాల్లో వుండటం ప్రభుత్వాని కిష్టం వుండదుగనక చట్టం అక్కడ ప్రవేశిస్తుంది. ఎవరైనా దౌర్జన్యం చేస్తే వారించవలసిన, శిక్షించవలసిన 'బాధ్యత' చట్టానికి వున్నప్పటికీ దాని "కర్తవ్యం" అదికాదు. దేశంలో అత్యున్నతాధి కారాలు గల న్యాయ శాసనం పాశవికతతో, హేతు విరుద్ధంగా, ఏకపక్షంగా ఉన్నది. సమాజ సంబంధాలు విలువలు మారుతున్నప్పుడు ఏమీ మారని శిలాశాసనాలు సమాజాన్ని కంట్రోల్ చెయ్యచూడటం అవివేకం. ఈ అవివేకాన్ని ప్రశ్నించినందుకు, ధిక్కరించినందుకు చట్టం జైళ్లని సృష్టిస్తుంది. అడిగిన వాళ్లని బందీలుగా చేస్తుంది.

నిజానికి ఏంజరుగుతోంది? నిజాయితీతో ప్రజల శ్రేయస్సు కోరేవారు అధికార దాహంగలవారికి అయిష్టులవుతున్నారు. దొరలు నయవంచనతో, మోసంతో బెదిరింపులతో తమ దగ్గర్నుంచి లాక్కున్న భూములకోసం రైతులు ఎర్రజెండా ఒకచేత, నాగలి ఒక చేత పట్టుకుని భూస్వాముల గుండెల మీంచి నడిచి వెళ్ళి భూముల్ని దున్నారు.

మధ్య యుగాల నుండి భూస్వాములు నిర్మించుకుని కూచున్న ప్యూడల్ దుర్గాల పునాదులు నెర్రెలు పడ్డాయనీ ఈయుగం ఇంకెంతో కాలం ఆదుర్గాల్ని సహించి మోసే స్థితిలో లేదనీ హెచ్చరించారు.

మీ స్వార్థాలు, మీ ప్రలోభాలు మీకు అత్యంత కళాత్మకంగా కన్పిస్తున్నాయేమో గానీ అకళాఖండాలు గీయటానికి మా రక్తం రంగులుగా ఉపయోగించటాన్ని అంగీకరించం అని తిరగబడ్డారు.

భూస్వాముల 'మంచి' రోజుల మీద రైతుల కత్తి వేటుపడింది. దానితో రాజ్యాంగ యంత్రం చట్టాల కోరల్నిసాచింది. కాస్తతలెత్తి మాట్లాడే యువకుడైన వాడెవ్వడూ ఊళ్లో ఉండటానికి అనర్హుడయాడు. జైళ్ళ నోళ్ళు తెరిచాయి.

1976లో వరంగల్ జిల్లా మొత్తం మీద 31 పోలీస్ స్టేషన్లూ, రెండు ఔట్ పోస్టులూ వుంటే 1984లో ఒక వరంగల్ నగర ప్రాంతంలోనే 10 పోలీస్ స్టేషన్లున్నాయి. వీటిలో ఒకటి చిత్రహింసల కేంద్రం కాగా ఒకటి "అదృశ్య" పోలీస్ స్టేషను; ఇవికాక ఎ.పి. ఎస్పీ క్యాంపులు, భూస్వాముల దగ్గరున్న లైసెన్స్‌డ్, అన్ లైసెన్స్‌డ్ తుపాకులు, బాంబులు, బరిసెలు, కత్తులు లెక్కపెట్టడం వల్ల మేధావులు భయకంపితులవటమే తప్ప ప్రయోజనంలేదు.

జైళ్ళ నోరు ఎంత బాగాసాగిందంటే వరంగల్ సెంట్రల్ జైలు కెపాసిటీ 600 ఖైదీలు మాత్రమే కాగాదాన్లో 800 పైగా నింపారు. ఈ మాట జైలు అధికారులే ఒప్పుకున్నారు. వీళ్ళు కాక అనేక పోలీస్ స్టేషన్లలో అక్రమ నిర్బంధంలో ఉన్నవాళ్ళ లెక్క ఎంతో తెలుసుకుంటేనేగాని నిర్బంధ తీవ్రతలో కొంతైనా అర్థంకాదు.

చట్టం కోరల్లో ప్రజానీకం ఇరుకుతున్న కొద్దీ జైలు పొట్ట ఉబ్బిపోయి ఖైదీలు రాజమండ్రి జైలుకీ, విశాఖపట్నం జైలుకీ ప్రవహించారు. అదిగూడా అధికారులు విషయాన్ని గ్రహించటం వల్లకాదు. జనం ఎక్కువయారనీ, ఉండజాగా లేకుండా పోతున్నదనీ ఖైదీలు సమ్మెచేస్తే, ఆ సమ్మెని అణచడానికి అధికార్లు జైలులోపల లాఠీ చార్జి జరిపారు. నలుగురు గాయపడ్డ వాళ్ళని ఆస్పత్రిలో చేర్చి ఆతర్వాత ఖైదీల్ని ఇతర ప్రాంతాలకి తరలించారు.

నార్కట్‌పల్లి దగ్గర దీలు తప్పించుకున్న సంఘటన జరిగిన తర్వాత ఆ తప్పించుకు ఖైదీలకు బయటివాళ్లే ఆయుధాలు అందించారని, వున్న వాళ్ళని

చూడవచ్చే బంధు మిత్రుల్ని స్త్రీ పురుషభేదం లేకుండా గుడ్డలు విప్పించి అవమాన కర పరీక్షలకి గురిచేశారు. పైగా ఖైదీలతో నేరుగా కాకుండా ఇనపతీగ వల అడ్డం ఉన్న కిటికీలోంచి మాత్రమే మాట్లాడాలని శాసించారు. ఈ పద్ధతి నిరంకుశమని మళ్లీ ఖైదీలు సమ్మె చేస్తే వాళ్ళని వేరే జైళ్లకు తరలించారు.

ఇదంతా ఎందుకు జరుగుతోంది? బందీలు కేవలం ఈ దేశ పౌరులు మాత్రమే కాదు ఈ యుగశక్తులు కూడా. ఈ యుగశక్తులే కాదు రాబోవు యుగపు దూతలు కూడా కాబట్టి! వ్యక్తి లక్షణాలని సమాజం నియంత్రిస్తుంది. వ్యక్తిని నిర్బంధించటం వల్ల సమాజ భావాలు అరికట్టటం సాధ్యంకాదు. మానవ సమాజంలో మానవోచితమైన ఉద్యమాన్ని ఏ శక్తీ అణచలేదు.

అందువల్లనే వ్యక్తుల్ని బంధించి జైళ్ళలో పెడితే ఆ వ్యక్తులు తమ యుగ స్వభావాన్ని ప్రదర్శిస్తారు. ఏ సామాజిక పీడన జైలు లోపల గూడా వ్యవస్థీకృతమై ఉందో దానికి వ్యతిరేకంగా కూడా పోరాడుతారు. అది కూడా వర్గపోరాటంలో భాగమే. బయటి సమాజంలో ఉండే పీడన జైల్లో గూడా ఉండటం వల్ల, జైలు సమాజంనించి వేరుపడ్డ ఏకాంత ద్వీపం కాదు గనుక పోరాటకారుడికి జైలు కూడా వర్గపోరాట కేంద్రమే అవుతుంది.

బందీలు ఆవర్గపోరాటంలో భాగంగా బయటి సమాజంతో బౌద్ధిక సంబంధం ఏర్పరచుకుంటారు. ఆ ప్రయత్నంలో భాగమే వరంగల్ సెంట్రల్ జైలు రాజకీయ ఖైదీల లిఖిత మాస పత్రిక "బందీ".

32 అరఠావు పేజీల బందీ మొదటి సంచిక పదకొండు కవితలు పాటలతో, ఒక వ్యాసం, ఒక కథతో నిండుగా వుంది. దీన్లో రెండు, గిరిజన గీతాలు. ఉద్యమ వైవిధ్యం ఉద్యమ సాహిత్యంలో గూడా బింబిస్తుందనడానికి ఇది తార్కాణ.

సంపాదకీయంలో "…. మేము కత్తుల్నే కాదు మా కలాల్ని గళాల్ని శత్రువుకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టే క్రమంలో కవాతు చేస్తున్నాం" అనటం దీర్ఘకాలిక పోరాటంలో కత్తినీ, కలాన్నీ సమంగా వాడటమే అవుతుంది.

బందీ కవితలో వికాస్ బందీయై గూడా "మారు మోగిస్తున్నాం బందిఖానాలో సైతం/బతుకుపోరు జన జీవన ఖడ్గ సంగీతాన్ని" అని శత్రువుని ధిక్కరిస్తున్నాడు. ఐతే కవిత మొదట్లో 'మాలిన్యంతో/మానసిక బందీలైన/మనుజులారా।' అన్న సంబోధన ఎవరిని గూర్చి అన్నది అస్పష్టంగా వుంది. మనుజులారా! అన్నవాక్యం ప్రజా కార్యకర్త గూడా వాడటం బహుశా అప్రియత్నమే కావచ్చు.

'కడవరకు' కవితలో ఇండియాలో మార్పుకోరి ఇంద్రవెల్లిలో రక్తతర్పణం చేసిన గిరిజనులు ఈ వ్యవస్థ మారే వరకు మనలోనే వుంటారని ఎర్రన్న అంటాడు. "రెండు నిమిషాల మౌనంలో/మూడుసంవత్సరాల క్రితపు విషాదం" గుర్తుచేసుకొని ఆ బందీ జంగ్‌కు తయారవుతున్నాడు. అయితే ఈ సందేశం అందించటంలో కవిత్వం కొంత తక్కువయింది.

కా॥ మేడిశెట్టి శంకర్ 'స్మృతిలో' మీనయ్య రాసిన కవిత శంకర్ విప్లవ కృషినీ, ఆ కృషిలో ఆతని అమరత్వాన్నీ తెలుపుతుంది. కవికి శంకర్‌తో గల సాన్నిహిత్యాన్ని గూడా కవితలో చూడవచ్చు. కవిత చాలా చోట్ల పాటగా సాగింది. కవిత గాకన్నా పాటగా బాగుంది. మీనయ్య గారు పాటలు రాయటంలో శ్రద్ధచూపితే బాగా రాయగలరని తెలుస్తోంది.

'విప్లవాలపాఠశాల' అనే రాంసాహు కవిత మంచి వ్యక్తీకరణ ఉన్న కవిత జైలుని పాఠశాలగా చేసుకొని చదువేమీ రాని మొరటు మనషులు ఇంటికి ఉత్తరాలు రాయటం దగ్గర్నించి పారిస్ కమ్యూన్ గూర్చి చదివే దాకా ఎదగటానికి కారణం వాళ్ళు విప్లవ కార్యక్రమంలో నిమగ్నం కావటమే అనిచెప్తాడు.

చెర విముక్తులు అన్న కవితలో విప్లవ కారుల్ని బంధించావని మురుస్తోంది ప్రభుత్వం కానీ ఆలోచనల్ని, సమయం వస్తే ఆతణ్ని గూడా బంధించలేదు అని చెప్పారు సూరి. ఈ భావాన్ని ఇంకొంచెం కవితాత్మకంగా చెప్తే బాగుండేది. గోండు భాషలో వున్న "కరల్ జెండా" గీతంలో విషయం బాగుంది. మూల భాష సంగతి తెలీదుగానీ అనువాద విషయంలో ఇంకొంచెం జాగ్రత్తపడితే లయ బాగాకుదిరేది. అనువాదం యథాతథంగా [illegible]

తప్పులేదు. "ఊరు మనదిరా ఈవాడ మనదిరా" అనే పాటని "గాంవు అపళరే-
ఏటాండో అపళరే" అనిలంబాడీ భాషలోకి నాయక్ స్వేచ్ఛానువాదం చేశారు. ఈపాటలో
లయ బాగా కుదిరింది.

'పోరు పతాక' మేడిశెట్టి శంకర్ కోసం మృత్యుంజయగారు రాసిన ఎలిజీ.
విషయం పదునుగావుంది. "చల్లని దీవెన" పాటలో ఆర్కే యస్. "మృత్యుంజయులు"
కవితలో నీలయ్య, శంఖారావం పాటలో ఉపాధ్యాయ, కా॥ హరిభూషణ్ అమర్ హై
పాటలో రాంబాబు చెప్పదలుచుకున్న విషయాన్ని చెప్పటంలో సఫలీకృతులయారు

జూలై సంచిక 52 పేజీలతో పది కవితలు, పాటలతో, ఒక ఇంగ్లీషు కవితతో
రెండు వ్యాసాలతో ఒక కథతో మరింతపరిపుష్టంగా ఉంది. 7 పేజీల సుదీర్ఘ సంపాద
కీయంలో పంజాబ్ మారణకాండనీ, భివాండి కల్లోలాన్నీ, తెలంగాణాలో పోలీసు
పాలననీ సంపాదకుడు చర్చించాడు. ఇలాంటి దారుణాలు మళ్ళీ మళ్ళీ జరగకుండా
ఉండటానికి "....అతినీచమైన పనులు చేసే రాక్షసులపై కసినిపెంచుకోవాల్సిన
సమయంకూడా. హత్యలూ లూటీలూ, దహనాలు చేసే వారిపై వారిని కాపాడే వారి
పైకూడా కసిని పెంచుకోవాలి, కేవలం మనకోపం మాత్రమే వాళ్ళను భీతిల్ల జేస్తుంది.
మనందరి కోసమే ఈ భయంకరమైన సంఘటనలు మళ్ళీ మళ్ళీ జరుగకుండా
చూస్తుంది" అంటాడు.

"ఈ యుద్ధం....?" కవితలో సహగామి సిఖ్ఖుల మీద ఇందిర జరిపిన
యుద్ధాన్ని ప్రశ్నించాడు. స్వజాతిని విజాతిగా ఎంచి తెల్లదొరలకన్న ఇందిర మిన్న
అని పించిందనీ, ఎగసిన జ్వాలలు ఇంక వూరుకోవనీ చెప్తాడు.

"మన బతుకులు" పాటలో ఆర్కే యస్ భూమి లేని రైతుల కష్టాలకి కార
ణాల్ని అవి పోయే విధానాన్ని చక్కగా వివరించాడు. 'గోగుల తండాహీరుల కథ'
పాటలో రాంచందర్, సత్తెన్నలు సాగించిన పోరాటం ప్రమాదవశాత్తూ బాంబు
పేలి వారు మరణించినతీరూ వర్ణించబడింది. ఐతే పాట రాయటంలో ఇంకాస్త శ్రద్ధ
తీసుకుంటే వాక్యాల అమరిక కుదిరేది. శ్రీశ్రీకి జైలులో రాజకీయ బందీల విప్లవ
జోహార్లు రాంసాహూ అర్పించాడు. అనేకానేక బాధ్యతలు, సమస్యలు, చిక్కు

ముళ్ళ మధ్య బంధీలు శ్రీశ్రీ వర్ధంతి సందర్భంగా జోహార్లర్పించటం చూస్తే శ్రీశ్రీ నివాళ్లెంతగా పేరుకుస్తున్నారో, శ్రీశ్రీ చిరునామా ఎక్కడుందో తెలుస్తుంది.

'The Sparks of Naxalbari' కవితని కంబం మెట్టయ్య రాశారు. ఈ ఇంగ్లీషు కవిత నక్సల్బరీ ఆదిలాబాద్ కరీంనగర్‌లకెలా విస్తరించిందీ, దాన్ని శత్రువెలా అణచి వేస్తున్నదీ, అణచివేసే ప్రయత్నం చేస్తున్నకొద్దీ అది పైకెలా ఎగసి వస్తున్నదీ వివరించారు.

ఇక కథల మాటకొస్తే రెండు సంచికల్లోనూ రెండు మంచి కథలున్నాయి. "తుమచ్యా మది తాకత్ అస్లియాతరీ" (మీకు ఏ మాత్రం ధైర్యమున్నా గుట్ట ఎక్కండి) అనే కథ గిరిజనులు అడవి నరకడానికి సంబంధించింది. ఈ కథ జూన్ సంచికలో వుంది. రాంసాహు రాశారు.

లాలాగూడా గిరిజన రైతు కూలి సంఘం అడవి నరుకుతోంది. గోండు పార్వతమ్మ మాటల్లో 'మనబతుకు కోసం అడివి నరకడం నేరమంటుంది ఈసర్కార్.... మరి ఏండ్ల తరబడి అడివి నరుకుతంది సర్కార్. అది నేరంచేస్తలేదా.... కడుపు కోసం, భూమికోసం అడివినరుకుడు తప్పయితే ఆతప్పుమనం చేసుడే" గోండ్లు భూమి కోసం అడవితో యుద్ధం చేస్తున్నారు. ఈ సంగతి తెల్సి పోలీసులు వస్తారు గుట్ట ఎక్కబోతుండగా యస్సయి ఒకబండ మీద మరాఠీలో ఏదోరాసి వుండటం చూస్తాడు దారిచూపుతున్న దేవరావుని అది చదవు మంటాడు.

"మీకు ఏ మాత్రం ధైర్యం వున్నాగుట్ట ఎక్కండి. లేకుంటే కాళ్లు మొక్కి వెనక్కిపోండి" ఈ మాటలు చదువుతుండగా పటాను మీద గిరిజనులు నినాదాలు చేస్తూ చెట్లు నరుకుతారు. అవి పెళపెళమని కూలుతాయి. పోలీసుల మొహంలోని నెత్తురు ఆవిరయింది. 5 పేజీల ఈ కథ సమగ్రంగా వుంది. గోండులు తమ జీవనాధారాలకి, పార్టీని ఎలా సాధించారో చక్కగా చూపారు. కథ రాయటంలో రచయితకు నేర్పువుంది. పోరాటానుభవంనించి ఎలాంటి కథలు వస్తాయో చూపటానికి ఈ కథ ఒక ఉదాహరణ.

రెండోకథ 'జనం మేల్కొన్నది' అనేది జూలై సంచికలో వికాస్ రాసారు

సాంబయ్య అనే పేదరైతు తన బంధువు రామయ్య ఊరికి వెళ్ళి అక్కడ వాళ్ళు సంఘం పెట్టుకుని సమస్యల్ని తీర్చుకోవటం చూస్తాడు. తమ గ్రామంలో కూడా సంఘం పెట్టుకుంటే సమస్యలు తీరతాయని చైతన్యం పొంది ఊరికి వచ్చి ఊరి వాళ్ళతో చర్చించి సంఘ నిర్మాణం చేస్తాడు. విషయం మామూలుదే ఐనా చెప్పిన పద్ధతి బాగుంది. ఐతే కోడిచర్యల్నీ, మనుషుల చర్యల్నీ సుదీర్ఘంగా వర్ణించటం రచయితకు సహజంగా వున్నదికాదు, అలవరుచుకున్నదే. దాన్ని వదిలి వెయ్యటం మంచిది, కథకి అవసరమైనంత వర్ణనచాలు.

ఉన్న రెండు వ్యాసాల్లో ఒకటి 'కమ్యూనిస్ట్ ఇంటర్నేషనల్ చరిత్ర.' శాస్త్రి దీన్ని సంక్షిప్తంగా వివరించారు. మరొకటి 'స్త్రీల సమస్యలు_ఒక పరిశీలన' మత్యుం జయ రాశారు. స్త్రీలు మాతృస్వామిక వ్యవస్థా దశనించి ఈనాటి దుర్భర పరిస్థితుల్లోకి ఎలానెట్టివేయబడ్డదీ సంక్షిప్తంగా సమగ్రంగా వివరించారు. దోపిడీవర్గానికి ప్రాతినిధ్యం వహించే స్త్రీలు లేని మహిళా సంఘాలలో స్త్రీలని సమీకరించి వ్యవసాయిక విప్లవం ఇరుసుగా గల నూతన ప్రజాస్వామిక విప్లవంలో వాళ్ళని భాగస్వాములుగా చెయ్యాలని పరిష్కారం గూడా సూచించారు.

ప్రత్యేకంగా చెప్పవలసిన అంశం ఇంకొకటి వుంది, పాటలకీ, కవితలకీ, కథలకీ చిత్రాలు వెయ్యటం. మొదటి సంచికలో ముఖ చిత్రంకాక ఎనిమిది చిత్రాలు న్నాయి. రెండో సంచికలో గూడా ఎనిమిది చిత్రాలున్నాయి. మార్క్స్, లెనిన్, శ్రీశ్రీ వంటి వారివే కాక కథలకీ వ్యాసాలకీ అనుగుణమైనవీ వున్నాయి. ముఖచిత్రం భావస్ఫోరకంగా వుంది. జైలు కటకటాల మధ్యనించి ఉవ్వెత్తునలేచి సంకెళ్ళు తెంపుకుని పిడికిలెత్తి నినదిస్తున్న బందీ__ని నిజంగా 'బందీ' అనగలమా! (మేంచూసిన కాపీ అసలుకు నకలు. అసలుకాపీ ఇంకెంత బాగుందో)

ఉద్యమంలో ఎన్నిరకాల వైవిధ్యం, ఎన్ని దృక్కోణాలు వుంటాయో అవన్నీ ఈ లిఖిత పత్రికలో ఉండటం ఉద్యమ కారులు నిర్వహిస్తున్నందువల్లనే అని అనుకోవాలి.

— సాహితీ మిత్రులు

బందీ_సాహితీ మాస పత్రిక-ప్రారంభ సంచిక జూన్ 1984, జూలై 1984
నిర్వహణ - రాజకీయ ఖైదీలు, వరంగల్ సెంట్రల్ జైలు. వెల లేదు. అయితే కాపీలు దొరకవు జైల్లో పడితే తప్ప!

కరపత్రం :

# కర్ఫ్యూలో జన జీవితం

నగరంలో కొన్ని ప్రాంతాలలో మళ్ళీ కర్ఫ్యూ వచ్చింది. ఈ సంవత్సరం కర్ఫ్యూ విధించడం ఇది ఏడోసారి. గత కొన్ని సంవత్సరాలుగా జంటనగరాల జన జీవితంలో కర్ఫ్యూ ఒక విడదీయరాని భాగమై పోయింది. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ లోని 144వ సెక్షన్ ప్రకారం జిల్లా మేజిస్ట్రేట్‌కు ప్రజల ప్రాణానికి, ఆరోగ్యానికి భద్రతకు భంగం వాటిల్లినప్పుడల్లా "ఏ వ్యక్తినైనా, ఏ పనిచేయకుండా నివారించే" అధికారం వుంది. ఈ చట్టం కిందే మన నగరంలో తరచుగా కర్ఫ్యూ ప్రకటిస్తున్నారు

ఈ కర్ఫ్యూ రావడం మత కలహాల పేరుతో వస్తుంది. కాని ఈ కలహాలకి కారణమయిన నాయకులు, ఆయా సందర్భాలలో కొన్ని రోజుల పాటు విచారణ లేకుండా నిర్బంధంలో ఉంచి పరిస్థితి చల్లబడిన వెంటనే మళ్ళీబయట తిరుగుతుంటారు వారి మీద కేసులుండవు. మత కలహాలకి కారణమయిన వాళ్ళ మీద కేసులు త్వరితంగా నడుపడానికి ప్రత్యేక న్యాయ స్థానాలు ఏర్పడి ఆరు నెలలు గడిచింది. కాని వాటికింకా న్యాయమూర్తులను కూడా నియమించలేదు. జరుగుతున్నదల్లా అమాయక ప్రజల మీద అక్రమ కర్ఫ్యూ నిబంధనలను అమలు జరపడమే.

కర్ఫ్యూవల్ల నగరంలో కర్మాగారాలలో ఉత్పత్తి ఆగిపోతుంది. ప్రభుత్వకార్యాలయాల్లో ఫైళ్ళు నిలిచి పోతాయి. విద్యారంగంలో విద్య ఆగిపోతుంది. దవాఖానాల్లో చికిత్స ఆగిపోతుంది ప్రతి రోజు ఉదయం, సాయంత్రం ఎండల్లో, వానల్లో నగరానికి వచ్చిపోయే వందలాది ప్రజలకు అఫ్జల్‌గంజ్ డిపో బందిఖానా అవుతుంది. చివరికి హైకోర్టుతో సహా అన్ని న్యాయస్థానాలలోనూ న్యాయం స్తంభించి పోతుంది. మూసీనదికి దక్షిణంగా నివసిస్తున్న ప్రజలందరికీ గృహమే కారాగారమవుతుంది. పెళ్ళిళ్ళు, చావులు కూడా ఆకాశవాణిలో అస్తవ్యస్తంగా చదివే టెలిగ్రాంల ద్వారా తెలుసుకోవాల్సి వస్తుంది. నిత్యావసర వస్తువుల ధరలు (దొరికినపుడు) విపరీతంగా పెరిగిపోతాయి. లీటరు మూడున్నర రూపాయలకు దొరికే పాలు పది పదిహేను రూపాయిలు అవుతుంది. పాత బస్తీలో కాయగూర అమ్ముకొనో, రిక్షా తొక్కుకునో రోజు కూలీ చేసుకునో బతికే వేలాది మంది పేద ప్రజలకు బతుకు తెరువుపోయి ఆకలి, దారిద్ర్యం మరింత తీవ్రమవుతాయి.

వీటన్నింటిని మించి కర్ఫ్యూ ప్రాంతాలలో పోలీసుల అధికార దుర్వినియోగం అడ్డు అపూ లేకుండా పెరిగిపోతుంది. ఈ ప్రాంతాలలో ఇటీవలే ప్రభుత్వం పోలీసు అధికార్లకు మెజిస్ట్రీరియల్ అధికారాలిచ్చింది కూడా.

ఎక్కడైనా కత్తిపోటు సంఘటన జరిగితే, అసలు నేరస్తులెవరో ఆ ప్రాంత ప్రజలందరికీ తెలుస్తూనే వుంటుంది కాని వాళ్ళని పోలీసులు ప్రశ్నించనయినా ప్రశ్నించరు. అమాయక ప్రజలను మాత్రం వందలాది మందిని నిర్బంధిస్తుంటారు స్కూళ్ళు, కాలేజీలు లేక ఇళ్ళలో కూచుని కాలక్షేపం చేసే కుర్రవాళ్ళు, పిల్లల పాల కోసం వీధి బయటకు తొంగి చూసే గృహస్తులు, ఇంటి ముందు నల్లాలకు మంచి నీటి కోసం వచ్చే గృహిణులు పోలీసుల లాటీ దెబ్బలకు గురవుతుంటారు కర్ఫ్యూ పాస్ ఉన్న వాళ్ళకు కూడా ఈ లాఠీదెబ్బలు నిర్బంధాలు తప్పవు.

అరెస్టు చేసిన వాళ్ళని దగ్గరలోవున్న పోలీసు స్టేషన్‌కో. చార్మినార్ ప్రాంతీయ కంట్రోల్ రూముకో తీసుకెళ్ళి కొట్టి, ముషీరాబాదు జైలుకు పంపిస్తుంటారు. ఇటీవలి కాలంలో ఈ రకంగా అక్రమ నిర్బంధానికి గురి అయిన వాళ్ళలో మత కలహాలతో ప్రమేయం ఉండటానికి ఆస్కారమే లేని ఇతర మతాల వారున్నారు. పోలీసు లాటీ లకు మతి స్థిమితం తప్పిన 15 ఏళ్ళ బాలుడు ఉన్నాడు, అన్యాయంగా మూడు నెలలు జైలులో గడిపిన అంధ యువకుడు కూడా వున్నాడు.

ప్రతి రోజు వందల వేలమందితో కిటకిటలాడే రహదార్లన్నీ కర్ఫ్యూ విధించిన వెంటనే జన సంచారం లేకుండా పోతాయి. రోజుల తరబడి, వారాల తరబడి మూలిగే ఈ నిర్మానుష్యమైన రోడ్లమీద సాయుధ పోలీసులు గస్తీ తిరుగుతుంటారు యాంటీ గూండా స్క్వాడ్ పేరుతో పోలీసులు మఫ్టీలో తిరుగుతుంటారు. వాళ్ళ స్వైర విహారాన్ని చూసేందుకు, అదుపు చేసేందుకు ప్రజా సంఘాలు ఏమీ ఉండవు. పత్రికా విలేఖరులుండరు. ఫలితంగా ప్రజలు ఎవరూ గుర్తించని నిర్బంధానికీ, దాడులకు గురి అవుతున్నారు.

ఈ ప్రాంతాలు ఒకటి రెండు కావు పన్నెండు నుండి ఇరవై నాలుగు పోలీస్ స్టేషన్ ప్రాంతాలు. ఈ కర్ఫ్యూ ఒకరోజు కాదు. రెండు రోజులుకాదు గత 180 రోజులలో 97 రోజులు బాధలకు గురవుతున్న ప్రజలు ఒకరిద్దరు కాదు, ఎనిమిది

లక్షల మంది ప్రజలు. మొన్న గణేశ్ నిమజ్జనం రోజు కర్ఫ్యూలో జంట నగరాలలోని 55 పోలీస్ స్టేషన్ ప్రాంతాలలో, 39 ప్రాంతాలలో కర్ఫ్యూ విధించారు. 12 లక్షల మంది బాధితులయ్యారు.

జన జీవితంపై కర్ఫ్యూ పేరుతో జరుగుతున్న నిర్బంధాన్ని అదుపులో పెడ్తూ మొన్న హైకోర్టు కూడా ఉత్తర్వులు జారీచేసింది. కాని ప్రజాస్వామిక వాదులందరూ ఏకమై ఈ పరిణామాలను ప్రతిఘటించనంత కాలం, అవసరం వున్నా లేకపోయినా వచ్చే కర్ఫ్యూలతో అమాయక "ప్రజల ప్రాణాలకు ఆరోగ్యానికి భద్రత"కు భంగం వాటిల్లక తప్పదు.

---

## చైనా విప్లవ దినాన...

(చార్లీ చాప్లిన్ ఆత్మకథలో చౌ ఎన్ లైతో సమావేశం భాగాలనుంచి)

ముప్పైలలో కమ్యూనిస్టులు చైనాలోలోపలికి ఎలా తరిమేయ బడ్డారో చెల్లా చెదరయిన కొద్దిమందీ మావో సేటుంగ్ నాయకత్వంలో మళ్ళీ సంఘటితపడి ఎలా పెకింగ్‌కు తిరుగు ప్రయాణం ప్రారంభించారో, అలా సాగుతున్న క్రమంలోనే వాళ్ళు సైనిక శక్తిని ఎట్లా సాధించుకున్నారో నేను చాలా ఆసక్తికరమైన ఉదంతాల్లో విని ఉన్నాను. ఈ తిరుగు ప్రయాణమే అరవై కోట్ల చైనా ప్రజల మద్దతును కమ్యూనిస్టులు గెలుచుకునేలా చేసింది.

మావో సేటుంగ్ విజయోత్సాహంతో పెకింగ్‌లో ప్రవేశించినప్పటి ఒక హృద్యమైన ఉదంతాన్ని మాకు చౌ ఎన్ లై ఆ రాత్రి వివరించాడు. మావో సేటుంగ్‌కు స్వాగతం పలకడానికి పది లక్షల మంది చైనా ప్రజలు పెకింగ్‌లో ఎదురుచూస్తున్నారు ఒక విశాలమైన వేదిక, పదిహేను అడుగుల ఎత్తయినది, ఒక విశాలమైన కూడలి చివరన నిర్మించారు. ఆ వేదిక వెనకవైపు నుంచి ఆయన ఒక్కొక్క మెట్టూ ఎక్కి వస్తుండగా మొదట ఆయన తల పై భాగం కనిపించింది. పదిలక్షల కంఠాలనుంచి ఎలుగెత్తిన ఆహ్వానం అక్కడ సుళ్లు తిరిగింది. ఆ ఒంటరి వ్యక్తి పూర్తిగా కనపడే వరకూ ఆ ముక్తకంఠం అలా ఇంకా ఇంకా ఉచ్ఛస్వరంగా పెరుగుతూ పోయింది. ఆ మహా సమూహాన్ని చూస్తూ మావో సేటుంగ్, చైనా విజేత, ఒక్క క్షణం పాటు నిలబడ్డాడు. అప్పుడు అకస్మాత్తుగా ఆయన రెండు చేతులలోనూ ముఖాన్ని కప్పుకొని విలపించాడు. ....

# నగరంలో కర్ఫ్యూ

| సంవత్సరం - నెల | పోలీస్ స్టేషన్ ప్రాంతాలు | రోజులు | మొత్తం |
|---|---|---|---|
| 1978 : ఏప్రిల్ | 4 | 7 | |
| ఆగస్ట్-సెప్టెంబర్ | 4 | 4 | |
| | 3 | 11 | 22 |
| 1979 : సెప్టెంబర్ | 2 | 4 | |
| నవంబర్-డిసెంబర్ | 5 | 14 | 18 |
| 1980 : జనవరి | 7 | 7 | |
| సెప్టెంబర్ | 2 | 3 | 10 |
| 1981 : జూలై-ఆగస్టు | 5 | 10 | |
| | 5 | 7 | 17 |
| 1983 : జనవరి | 5 | 6 | |
| | 8 | 12 | |
| మే | 6 | 8 | |
| సెప్టెంబర్ | 24 | 12 | 90 |
| 1984 : మే | 5 | 5 | |
| | 10 | 15 | |
| జూ | 12 | 30 | |
| | 12 | 20 | |
| ఆగస్టు | 12 | 3 | |
| | 12 | 4 | |
| సెప్టెంబర్ | 12 | 4 | |
| | 4,9,24,12 | 1,5,7,4 | 97 |

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం,
జంట నగరాలశాఖ 23-9-84

# సృజన వద్ద అమ్మకానికి దొరికే సాహిత్యం

ల లు :

| | |
|---|---|
| రం భీం - సాహు, అల్లం రాజయ్య | 8-00 |
| కణం - అల్లం రాజయ్య | 6-00 |
| టుంబం - టావ్ చెంగ్ | 4-00 |
| న - చౌలి - హో | 6-00 |

లు :

| | |
|---|---|
| కర్తలు - అల్లం రాజయ్య | 5-00 |
| పొంల్లో - సింగరేణి కార్మిక కథలు | 5-00 |
| మితుడి డైరీ - కె. రాంమోహన్‌రాజు | 5-00 |
| గ్ మార్చ్ - చైనా కథలు | 6-00 |

కలు, నాటకాలు :

| | |
|---|---|
| మాలు మేల్కొంటున్నాయి - చెరబండరాజు | 8-00 |
| నీళ్ళు - చెరబండరాజు | 1-50 |

తా సంకలనాలు; పాటలు :

| | |
|---|---|
| యమం నెల బాలుడు - శివసాగర్ - మేలు ప్రతి | 10-00 |
| సాదా ప్రతి | 5-00 |
| రాబాల శ్రీరాములు - | 0-75 |
| నాట్య మండలి పాటలు | 3-00 |
| ం వీరయ్య పాటలు | 1-50 |
| వెన్నెల మీద నడుస్తుంది - అజ్ఞాత సూరీడు | 3-00 |
| వస్త్రం - వరవరరావు | 2-00 |
| - సాగర్ | 2-00 |
| ట్టు మీద సూర్యుడు - కె. రాంమోహన్‌రాజు | 3-00 |
| త గీత్ (హిందీ ప్రజా పోరాట పాటల సంకలనం) | 3-00 |

SRJANA TeluguMonthly 'October '84 - H/HNK-3
Regd. No. with Registrar of Newspapers 10953/67

## ఆర్థికంగా, హార్దికంగా సృజనకు సహకరించండి.

న్యూస్‌ప్రింట్ కొరత వుండదు – అని కేంద్రప్రభుత్వ ప్రకటనలు రోజూ వస్తూనేవున్నాయి. న్యూస్‌ప్రింట్ రేట్లు 1980 జనవరినుంచి 84 జులై నాటికి 60-65 రూపాయలనుంచి 105-120 రూపాయలదాకా (సింగిల్ రీమ్‌కు) పెరిగింది. అందువల్ల దిన పత్రికలతో సహా దేశంలోని పత్రికలన్నీ రేట్లు పెంచక తప్పలేదు.

18 సంవత్సరాల జీవితంలో (మాసపత్రికగా 14 సంవత్సరాలు) కేవలం 1977 నుంచి 79దాకా మాత్రమే సృజనకు న్యూస్‌ప్రింట్ కేటాయించబడింది. ఎమర్జెన్సీలో మినహా పత్రిక ఎప్పుడూ ఆగిపోలేదు. అయినా ఇందిరపాలనలో సృజనకెప్పుడూ న్యూస్‌ప్రింట్ కోటాలేదు పైగా 80 జనవరినుంచి న్యూస్‌ప్రింట్ రేటు విపరీతంగా పెరుగుతున్నది.

ఈ మధ్యకాలంలో పోస్టేజిరేట్లు, ప్యాకింగు సామగ్రిరేట్లు విపరీతంగా పెరిగిపోయాయి. ప్రింటింగుచార్జీలు, బ్లాక్‌మేకింగుచార్జీలు కూడ రెట్టింపయ్యాయి. కేవలం నవత ప్రింటింగ్ ప్రెస్, వరంగల్ సహకారంవల్ల మాత్రమే నాలుగున్నర సంవత్సరాలుగా సృజన చందారేటు పెంచకుండా ఎన్ని అటుపోటులు వచ్చినా నడుపగలుగుతున్నది. ఏతొందరవుండో, ఇబ్బందివుండో హైదరాబాదు, విజయవాడలలో ముద్రించవలసివచ్చినా ఎంత ఇమ్మడి ఖర్చవుతున్నదో 84 జనవరి సంచిక అనుభవం పాఠకులు చదివే వుంటారు.

ఈ రెట్టింపయిన అన్ని రకాల ఖర్చులకుతోడు బకాయలు పేరుకొనిపోతున్న ఏజెంట్ల వైఖరి: తమకు కావలసిన కాపీలకు అడ్వాన్సు పంపడం అనే ఖచ్చితమైన పద్ధతితో ప్రారంభమై క్రమంగా వందల రూపాయల బకాయ దగ్గర ఘనీభవిస్తుంది. అట్లాగే చాలమంది చందాదార్లు చందాఅయిపోయినా, సృజన రిమైండర్ అందుకున్నా రెన్యూ చేయించే శ్రద్ధవుండదు. ఈ అన్ని కారణాలతో సృజన నెలకు వెయ్యి రూపాయం నష్టంతో నడుస్తున్నది.

1. ఏజెంట్లు బకాయీలు చెల్లించేలాచూసి క్రమంతప్పకుండా సృజన తెప్పించే బాధ్యత ఆయా ప్రాంతాల పాఠకులే తీసుకోవాలి లేదా సృజన పాఠకుల సర్కిల్స్ ఏర్పాటు చేసుకొని ఒకరి పూచీ మీద తెప్పించుకోవాలి.
2. ఏజెంట్ల మీద ఆధారపడకుండా ఎక్కువగా చందాదార్లను చేర్పించాలి.
3. మీకు తోచిన రీతిలో ఆర్థిక సహాయం చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

– "సాహితీమిత్రులు"